# మహామంత్రి





రచన:

ఉభయభాషాప్రవీణ

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

తెలుగు పండితులు

నేషనల్ హైస్కూలు, రామచంద్రపురం

ప్రకాశకులు

శ్రీ రాధాకృష్ణా పబ్లికేషన్సు

రామచంద్రపురం

# తొలినుడి

వీణ యనఁగా కళ. వీనఁగనఁగా బలము. ఈ ఆఖ్యాయికలో గౌశాంబి కళకుఁ బ్రతినిధి యైనచో నుజ్జయిని బలమునకుఁ బ్రతీక. కళను జిన్నపుచ్చిన బలముగాని, బలమును తిరస్కరించిన కళగాని యేదేశమందైనను నిండు జీవముతో నిల్చి మనలేదనుట యనుభవ సారము. చేయిచాచి బలము కళతో వియ్యమందుట యీ కథ యం దొకవైపు నిల్చిన పరమసత్యము.

ఇంకొకవైపునఁ దన విశుద్ధ యశోరూపమున వెలుఁగుచు మనకు సాక్షాత్కరించువాఁడు మహామంత్రి యౌగంధరాయణుఁడు. ఈతని యశోధనమునకు వారసులే తరువాత వచ్చిన యమాత్యశేఖరులు చాణక్యుఁడు, తిమ్మరుసు మున్నగువారు.

ఈతని యేలిక కౌశాంబీప్రభువు వత్సరాజు. వీరి యద్భుత కథలతోఁ గథాసరిత్సాగరమేగాదు భారతదేశపు పల్లెలు, పట్టణములు నిండిపోయినవి. వీనిని గూర్చియే మేఘదూతలోఁ గాళిదాసు 'ఉదయనకథా కోవిద గ్రామవృద్ధు' లన్నాఁడు.

ఉదయనకథలు బహుముఖముల భారతీయ సాహిత్యములో వ్యాపించినవి. బౌద్ధులు, జైనులు సంస్కృత కవులు భిన్న భిన్న రీతులతో వీనిని బ్రపంచించిరి. కావ్యానుకూలముగ వీనిని సంస్కరించి భాసమహాకవి చక్కని రెండు నాటకములు వ్రాసెను. అందు ప్రతిజ్ఞా యౌగంధరాయణము ఈ రచనకు మిక్కిలి ప్రోద్బలమిచ్చినది. దీనికి యౌగంధరాయణుఁడే నాయకుఁడు. కార్యదీక్షలో స్వామిభక్తిలో నీతడు ప్రదర్శించిన ప్రతిభావిశేషములు నిరుపమానములు. తన ప్రభువు శత్రుకుతంత్రములఁ బడెనని వినఁగనే ఈతని హృదయ ముడికిపోయినది.

శత్రుప్రతీకారములో నీతని ప్రతిభ చరచర పాముపడగవలె ద్రిప్పుచుకొని నాట్యమాడినది. అన్నపానముల కాశింపక యున్మత్త వేషముతో వైరిపట్టణమునఁ దిరిగినాఁడు. విరోధక్రియలకుఁ బ్రతి క్రియలు పన్నినాఁడు. పదకములు వేసినాఁడు, కత్తిదూసి యుద్ధము చేసి రాజును జెఱ విడిపించి తాను జెఱలోఁ బడినాఁడు. ఈత్యాగము కార్యదీక్ష, మనల నాశ్చర్య చకితులను జేయునుగదా!

నేఁటి పరిష్కృత విద్యాప్రణాళికలోఁ బూర్వభారతీయ ప్రజ్ఞా ప్రకర్షముల గుర్తించుట, వానిని హృదయమునఁ బట్టించుకొనుట ప్రస్తుతవిద్యార్థుల కత్యంతావశ్యకము.

ఈ భారతమహామంత్రి కష్టసహిష్ణుత, కార్యదీక్ష, త్యాగనిరతి, ఆర్ద్రహృదయుఁడైన వత్సనరపతికళానుభూతి, నేఁటి విద్యార్థుల కాదర్శమై వారి భావవికాసమున కెంతయేని తోడ్పడునని మా నమ్మకము.

సలక్షణాంధ్రభాష నేర్చుకొనుటయేగాక తెనుఁగు నుడికారపు సొగసును గుర్తించుట ముఖ్యమను లక్ష్యముతో నీ రచన సాగింపఁ బడినది. అలఁతియలంతి తెనుగువాక్యములకు, అచ్చమైన జాతీయము నకు నెంతశక్తియున్నదో కనిపెట్టిన, విద్యార్థుల యాంధ్ర భాషారచ నము తెనుఁగుతీయదనమును గూడగట్టుకొను ననుట నిశ్చయము.

విద్యాభిమాను లీ రచనమును సర్వథా ప్రోత్సహింతురని విశ్వసింతుము.

రచయిత

# పరిచయము

శ్రీమదుభయభాషాప్రవీణులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు తమ "మ హా మ ం త్రి" కావ్యమునకుఁ బరిచయ వాక్యములు వ్రాయుమని నన్ను గోరిరి. వారిని అటు కవిపండిత లోకమునకుఁ గానీ, యిటు పామర జన సామాన్యమునకుఁ గానీ పరిచయము చేయవలసిన యగత్యము లేనేలేదు. ఏలన, వారు జగమెఱిఁగిన బ్రాహ్మణులలో అగ్రగణ్యులు. వా రీవఱకే రచించిన పద్యములు, పాటలు, నాటకములు, నాటికలు, నవలలు, కథలు, వ్యాసములు, — అన్నియును ఆబాలగోపాల ప్రసిద్ధములు. పెద్దలను బరిచయము చేయుట నిజమునకు సాహసమే యగును. అయినను "అడిగించు కుంటిని గదా, ఈ యవకాశము జార విడువ నేల" యని ఒండు రెండు వాక్యము లిచట వ్రాయుదును.

జగత్ ప్రసిద్ధమైన యుదయనుని కథలకుఁ జమత్కారములఁ గల్పించి వానిని చిన్నచిన్న నాటకములుగా భాసమహాకవి రచియించెను. ఈ నాటకములలో నొక్కొక్కటి నొక విశిష్టత గల్గి యున్నది.

"ప్రతిజ్ఞాయౌగంధరాయణ"మును గైకొని శ్రీ శాస్త్రిగారు హృద్యముగా నొక చిన్న 'నవల' గా దీనిని వ్రాసి

యున్నారు. పాఠశాలలందుఁ జదువు బాలుర కవగాహన మగు నట్లు అల్లిక జిగి బిగులతో సర్వాంగసౌష్టవముగా "మహా మంత్రి" ని సృష్టించినారు ఇందలి నవీనతకు వీరు ప్రతి యాశ్వాసమునకు జేసిన నామకరణములే సాక్ష్యములు. అవి భావ గర్భితములు, హృదయంగమములు. వీరి "మహా మంత్రి" ని జదివినప్పుడు భాసుని యితర నాటకములను దప్పక జదువ వలయు నను నుత్సాహ మేర్పడఁ గలదని నా దృఢ విశ్వాసము.

ప్రభుత్వ కళాశాల
రాజమహేంద్రవరము
29 – 6 – 1956

గ. శ్రీ. న. ఆచార్య
ప్రధానాంధ్రాధ్యాపకుఁడు

# చలువరాతి విగ్రహములు

అది కౌశాంబీనగర రాజభవనము. కోట చిన్నదే గాని మిక్కిలియందమైనది. మొదటిదేవిడీ దాఁటి లోనికిఁ బోయినఁ బశ్చిమమువైపునకు మఱియొక దుర్గద్వార మున్నది. ఆ ద్వారమునుండియే సుందరరాజభవనములు, చిన్నసరస్సులు, పూలతోఁటలు కాన్పించును.

దక్షిణమున రాచనగరు. ఉత్తరమున మహాకార్యాలయము. రెండిటికి నడుమఁ గొంచెము ముందుగా మౌక్తిక సౌధ మని యొక లోకోత్తర శిల్పరచనాభూయిష్ఠ మయిన భవనము.

అది మహామంత్రి యాలోచనామందిరము. అందన్యప్రాణికిఁ బ్రవేశము లేదు. మహారాజుగారు నగరములో నున్నప్పుడు, తలమునిఁగిపోయిన రాజకీయవ్యవహారములు తటస్థించినప్పుడే వారుమాత్ర మా మందిరాంతర్భాగమున నొకటి రెండు గంటలు సమాలోచనములు జరిపి వత్తురు. తక్కిన యుపమంత్రు లైనను ముదల గొనియే ముందులకు సాగవలెను.

చిత్రవర్ణశోభితములైన క్రొంబట్టు తివాచీలు పఱచిన సువిశాలమైన యుత్తరపుగదిలో హొంబట్టుదిండ్ల నానుకొని యొకమా రిటు నొకమా రటు కదలుచు నొక

మహాపురుషుఁడు తీక్ష్ణముగ నాలోచించుచుండెను. ఎదుట నేనుఁగుతొండము లెత్తిపట్టినట్లున్న చిన్న దంతపుబల్లపై శుభ్రపఱచఁబడిన నాలుగు శ్రీతాళపత్రములును, దలపై బంగారు నగిషీగల యొక గంటమును నున్నవి. ఆగంటపు మొనతోఁ గొన్ని శత్రురాజదుర్గములు తుత్తునియ లైపోవును. వేలకొలఁది సైన్యములు పరువులెత్తును. ఎదురొడ్డినవారి యదృష్టరేఖలు తుడిచికొనిపోవును.

ఆతఁడు చట్టున నొక శ్రీతాళపత్రమును దీసి గంటము నెత్తి వ్రాయఁబోయి కొంచెమునిదానించి మగల బల్లపై నుంచి దిగ్గునలేచి చేతులు వెనుకకుఁ బట్టుకొని యిటునటు నడయాడుచుండెను.

అతఁ డాజానుబాహువు. నలువది యేఁబదేండ్ల మధ్యవయస్కుఁడు. వదియార్వన్నె పసిండిరంగులో నున్న యాతని విగ్రహమునకు వ్యాయామమాంసలములై కండలుతిరిగిన భుజములు వింతగాంభీర్యము నొసంగుచున్నవి.

నన్నని విభూతిరేఖలమధ్య నున్న యెఱ్ఱని కుంకుమపుబొట్టు శివుని ఫాలనేత్రమును స్ఫురింపఁజేయుచున్నది. ముడుతలచే సంకుచితమగుచు వెనువెంటనే విప్పారుచున్న యాతని విశాలఫాలము సైన్యముల మొగ్గరములతోఁ

గవియుచు మరల విచ్చిపోవుచున్న మహాకురుక్షేత్రము వలె నున్నది.

అతఁడు మహామంత్రి యౌగంధరాయణుఁడు. నడయాడుచుఁ దటాలున నాఁగి యలవోకగా ముందుకుఁ జూచెను. ఎదుట నెత్తైన మణివితర్దికపై నున్న రెండు చలువరాతి విగ్రహములపై నాతనిదృష్టి పడెను. అందొకటి పూర్వ కౌశాంబీమహారాజు శతానీకునిది. రెండవది యాతని ప్రధాని యుగంధరునిది.

“ఓహో! యీ రాజమంత్రుల యనుబంధ మెంత చిక్కనిది. కార్యములో, ఖడ్గములో నా మంత్రి యీ రాజునకు దీపమును వీడని తోడునీడ. సమరోత్సాహములో, దుర్ఘటకార్యనిర్వహణములో నా మహారాజు కత్తికంటె నా యమాత్యుని బుద్ధి చురుకైనది. మహామంత్రి బుద్ధికంటె మహీపతి కరవాలము పదునైనది. ఆ రాజు మూర్తిగొన్న వీర రసమైనచో నీ మంత్రి ఆరసస్ఫూర్తికి మూలమైన స్థాయీభావము. ఆ జంట యట్లు కౌశాంబీరాజ్యమును సుస్థిరమును, శోభావంతమును జేసికొనెను. ఆయవతారములు ఉదయన రాజునకు మణిసింహాసనమును, నాకు మంత్రదండమును నొప్పగించి కీర్తిశేషము లై పోయినవి. కాఁగా నేఁడు తండ్రి శతా

నీక మహారాజు ఖడ్గనైశిత్యము ఉదయనరాజు వీణలోఁ బ్రవేశించినది. పితృదేవుని యచంచల రాజభక్తి నా నరనరమునకుఁ బట్టుకొన్నది. ఇదివఱకు గంటమును గత్తియును వేర్వేఱుగా సాధించిన మహాకార్యములను... ఇపు డొక చేతితోనే నిర్వహింపవలయునా ?

కన్ను లిటు ద్రిప్పెను. ప్రక్క కుడ్యముపై వత్సరాజు ఉదయనుని తైలవర్ణచిత్రము. అపరమన్మథమూర్తి యుదయనునిచేతిలో నాగవరప్రసాదము ఘోషవతి వీణ. సున్నితములైన యాతని వ్రేళులు వీణతీఁగెలపై నున్నవి. ఆ వీణాగానమాధుర్యమునకు వనగజములు పరవశములై మూఁగుచున్నవి.

మంత్రికిఁ జిఱునవ్వు వచ్చెను —

ఈ రాజు పుట్టుకయే యెంత విచిత్రమైనది ! ఒక్కొక్క విలక్షణవ్యక్తి జన్మప్రకారమే యాతని జీవన గ్రంథమునకు విషయసూచిక గాఁబోలు —

వత్సరాజు జన్మకథ తెరలు తెరలుగా నాతని కన్నుల యెదుట వ్రాలెను.

అవి శతానీకమహారాజు కౌశాంబి నేలుచున్న రోజులు. పాండవసంతతిలో నతఁడు చివరితరము. ఆతనికి ముందుతరములలోనే హస్తినాపురము గంగా

ప్రవేశ మగుటచే వారిరాజధాని కౌశాంబికి మాఱెను. క్రీస్తునకుఁబూర్వము ఏడవశతాబ్ది ప్రాంతమునఁ బాండవ వంశపుఁ జివరి మెఱపుగా నాతఁడు విలసిల్లెను. అతని పట్టపురాణి మృగావతి. ఆమె యచ్చర యని ప్రతీతి. ఖడ్గపాణియై శత్రువుల యెదుట నాతఁ డెంత కఠినుఁడో భార్యయెదుట నంత నవనీతము. చంద్రుఁడు రోహిణీ దేవిని, గాలి పూలరాణిని నెంత ప్రేమించిరో తెలి యదుగాని శతానీకుఁ డంతకంటె నెక్కుడుగ మృగావతిని ప్రేమించెను.

కౌశాంబీప్రజల పుణ్యఫలముగ రాణి మృగావతి గర్భవతి యయ్యెను. రాజుమనసులోఁ గల్పవృక్ష మధువులు పిండిన ట్లయ్యెను. ఆమె మనసుపడె నని తెలిసిన నతఁడు లోకాలోకతటములనుండి యైనను నా వస్తువును దెప్పించి యిచ్చును.

విధిరేఖ యెంత విచిత్రమైనదో గాని యామె కొక వింతకోరిక పుట్టెను. అది విని మహారాజు నిలువున నీర య్యెను. మంత్రి యుగంధరుఁడు చిఱునవ్వు నవ్వి సరియే దీనికేమున్న దనెను.

రక్తపు మడుగులో స్నానము చేయవలెనన్న రాణి కుతూహలానుసారముగ మరునాఁ డుదయమునకు శోణిత

ప్రాదము సిద్ధమైనది. చెలులు కైదండ లీయఁగాఁ బట్టపురాణి యా కన్నులు చెదరు నెఱ్ఱని సరస్సులోదిగి తృప్తిగా జలక్రీడను బూర్తిచేసి గట్టెక్కెను. ఎరికిని దెలియకుండఁ గొన్ని పుట్ల సిందూరమును రాత్రికిరాత్రి యా సరోవరములోఁ గలిపి మంత్రి రాజపత్నికి మనః ప్రమోదము గల్గించెనన్నది యొక రాజకీయ రహస్యము.

ఉదయారుణకిరణములచే మఱింత! యెఱుపెక్కిన పట్టు వస్త్రములో నామె విశుద్ధమూర్తి క్రొత్త చివురుగుత్తి నడుమఁబూచిన పూవువలె, గుంకుమబరిణెలో జాఱిపడిన యాణిముత్తెమువలె నొక వింతశోభను వెదచల్లెను. కొలను గట్టునుండి యంతిపురికి నామె నాలుగడుగులు వేసినదో లేదో యొక గ్రద్ద రివ్వున నెచటినుండియో వచ్చి మాంస ఖండ మనుకొన్నది గాఁబోలు — రాణి మృగావతిని దన క్రొవ్వాఁడి గోళ్ళతోఁ దన్నుకొని హిమాచలశిఖరము వైపునకు కెగిరిపోయెను. చెలుల హాహాకారములును, మహారాజు విషాదమును మిన్నుముట్టినవి.

దురదృష్టమునకు బలమైన ఱెక్కలున్నట్లే యదృష్ట మునకుఁ జూపుకైన కన్నులున్నవి. గరుడపక్షి యట్లు పోయి పోయి హిమశిఖరి ప్రాంతమునందలి యొక సమున్నత వటతరు శాఖపై వ్రాలెను.

విహగరాజు నఖప్రహారములచే, మేరమీఱిన భయముచే మూర్ఛలో మునిఁగిన మృగావతి పక్షిపట్టునుండి జాఱి గుబురైన మఱ్ఱికొమ్మలలోఁ జిక్కుకొని యెట్టకేలకుఁ గన్నులు విచ్చెను. ఎటుచూచినను గిరికారణ్యము — కనుఁ జీఁకటి పడుచుండెను. అస్తమయ సూర్యుని చరమకిరణములు, దుఃఖములోని యాశలవలె నాచెట్ల యాకులలో గొన్నిటిని వెలిఁగించుచుండెను.

సమీప మున్యాశ్రమమునందలి మునిబాలకులు సమిత్కుశ ఫలాదికమును బ్రోగుచేయుటకు దైవికముగ నచటికి వచ్చిరి. వా రా చెట్టుపలవలలో మూల్గుచున్న ప్రాణిని జూచి మొదట దయ్యమనుకొని భయపడి పిదపఁ బరికించి చూచి జాలిగొని యాశ్రమములోని గురువు వద్దకుఁ బరువెత్తి యీవార్తను నివేదించిరి. సహజ కరుణాళుఁడగు నాఋషి శిష్యులతో వచ్చి రాణిని బ్రయత్నపూర్వకముగాఁ జెట్టునుండి క్రిందకుదింపి జానకీదేవి నాదరించిన వాల్మీకిమహర్షివలె నామె నోదార్చి మెల్లగా నాశ్రమమునకు నడిపించెను.

దినములు కడచినవి. తా నొక మహారాజపత్ని నన్న మాటయే మఱచి, యామె ముని గారాబపు బిడ్డగాఁ బ్రొద్దుపుచ్చుట కలవాటుపడెను.

నవమాసములు నిండి యొక సుందర ప్రభాతకాలమున నటు సూర్యోదయ మగుచుండగా నిటు శకుంతలా పత్నికిఁ బుత్రోదయ మయ్యెను. భాస్కర తేజమును సహింపని యభిమానివలె నా రాచబిడ్డ తన పసి పసిఁడి రంగుల చిఱుత దేహముతో నాపర్ణశాలలోఁ బ్రదీపించెను.

ముని యథాకాలమున నా రాచకొడుకునకు జాతకర్మాది సంస్కారముల నెఱవేర్చి యుదయనుఁడను పేరుపెట్టెను. అసలే జాతిరత్నము ; దానికిఁ బరమర్షి సంస్కారము శాణోల్లేఖనమువలె వింత మెఱుఁగెక్కించెను.

జ్ఞానము వచ్చుచున్న కొలఁది నాతని చూపు వేఁటపైఁ బడినది. బాలభరతుని వలె నాతని యాకొటలాఘవము సింహకిశోరముతోఁ జెలలాడఁ దొడఁగినది. ముని శిష్యులతో దర్భఫలాదికమున కని బయలుదేఱును. కొంతదూర మేగుసరికి వారిదొక త్రోవ. వీని దొకదారి. అడవియందలి వ్యాధులీ బాలరాజును జూచి ముచ్చటపడి యెంతగనో మన్నింతురు. అందు విల్లమ్ములలో నాఱితేరిన వేఁటరులు ఆటమాటగా నీతనికి నల్లెత్రాట నలుగులు చిమ్ముట చూపించిరి. పదిపదునేను దినములలో వారికే వంకలు దిద్దువాఁడయ్యెను. ఒక నాఁడు చేత ధనుర్బాణములతోఁ బర్ణశాలకుఁ దిరిగి

వచ్చిన యుదయనకుమారుని జూచి ముని మృగరాజగర్భ మున గోవత్స ముద్భవించునా యని తనలోఁ దా నవ్వుకొనెను.

ఆతనికిఁ బదునాలుగేండ్ల ప్రాయము వచ్చినది. ఒక నాఁ డీ విచిత్రసంఘటనము జరిగినది—

యథాపూర్వముగా నా రాజకుమారుఁడు ధనుర్బా ణములనుబట్టి మృగయావ్యాసంగమునఁ బోవుచుండఁగా దారిలో నొకచోట నొక బోయ గొప్పజాతిపామును బట్టుకొని చీల్చి చంపివేయుటకు సిద్ధముగ నుండెను. అంత నా పాఁపతేఁ డీ బాలరాజునుజూచి దీనముగా "ఈబోయ వాని క్రౌర్యమునుండి నన్నుఁ గాపాడలేవా" అని పడగ నాడించి వేఁడుకొన్నట్లు పొడఁగట్టెను. వెంటనే పసిరాజు గుండెకరఁగి, తల్లి తనవ్రేల నిడిన రత్నాంగుళీయము నా పుళిందున కిచ్చి యా పన్నగమును విడువు మనెను. ఆ యడవిలోని బోయ లెల్లరకు సహజముగా నీ బాలు నందు గౌరవమున్నది. పైగా సువర్ణదర్శనము. వ్యా ధుఁడా బంగరుటుంగరము నందుకొని మ్రొక్కి తనదారిని దా నేఁగెను. పన్నగరాజునకుఁ బ్రాణములు కుదుటఁబడి నవి. ప్రాణదానమునకుఁ బ్రతిఫలముగ ఘోషవతి యను నొక దివ్యవీణను, నొక మంత్రమును నాగరా జీ బాల

రాజున కిచ్చి వాని మహత్త్వములు చెప్పి తన యునికికిఁ బోయెను.

కుమారుని వ్రేలితాకిడికి దివ్యవీణ మధురముగా ధ్వనింపసాగెను. ఆ యానందములో నాతఁడు ప్రాణ కార్మికముల మాటయే మఱచి పర్ణశాలకుఁ దిరిగి వచ్చెను.

కుటీరమునకు రాఁగానే గుండె లవియు నీ దృశ్యము పాప మాతేఁతమనసును గలవరపఱచెను.

చిఱునవ్వుతోఁ దన కెదురుగా వచ్చు తల్లి యొకచోఁ గూర్చుండి బొటబొట కన్నీరు గార్చుచు దురపిల్లు చుండగా మహర్షి యోదార్చుచుండెను. కుమారుఁడు కొయ్యబాఱి నిలుచుండెను. నెమ్మదిమీఁద కొంతసేపటికి బయటఁబడిన వృత్తాంత మిది:

మహర్షి యొందులకో యానాఁటి గ్రహ నక్షత్ర యోగమును లెక్కవేసి 'అయ్యయో! ఎంతపని జరిగి నది!' అనఁగా రాణి యేమది యని ప్రశ్నించెను. ముని విషణ్ణవదనముతో "కౌశాంబీమహారాజు శతా నీకుఁడు స్వర్గస్థుఁడయ్యెను, ఇంక నీనేల యరాజక మగు" నని వ్యాఖ్యానించెను. రాణి కుప్పగూలి తానును దన బిడ్డయు నారాజకుటుంబమే యని యపుడు వెల్లడించెను.

ముని కేమియుఁ బాలుపోలేదు. ఈ తరుణమును దాఁటఁబెట్టిన నారాజు గర్భవాసమయిన యీ రాచ మొలకకు రాజ్యము చేదాఁటి పోవును. పరరాజుల చేతు లలోఁబడిన ప్రజలు నలఁగిపోవుదురు. ఉదయనకుమారుని వలన సర్వకథవిన్న మహర్షికిఁ జట్టున నొక యుపా యము స్ఫురించెను. అది యిట్లు వెనువెంటనే రూపు గట్టెను. ఆవీణాగానమంత్రశక్తులతో వేలకొలఁది వన మాతంగములను గూడఁగట్టవచ్చును. ఆ గజయూథ బలముతోఁ జరచర కౌంశాంబికి నడచి కోటను బట్టు కొనుట యొక్కటియే ప్రస్తుతకర్తవ్య మని నిశ్చయించి రాజకుమారుని బ్రోత్సహించెను. ఘోషవతి రింగురిం గున మ్రోఁగఁజొచ్చెను. మదద్విరదనందోహము చెంగు చెంగునఁ దొండము లెత్తి నడువఁదొడఁగెను.

వీరమాత మృగావతి యుదయనకుమారునితో నొక దంతావళము నెక్కి క్షణములోఁ గౌశాంబికోటవద్ద వ్రాలెను.

మంత్రి సామంతాది ప్రకృతులు మహారాజ మరణఖే దమును గుమార సందర్శనముతో మఱచి మాతా పుత్రులకు స్వాగతము చెప్పి కోటతలుపులు తెఱచిరి. ఆనందబాష్పములతో దృష్టి చెదరగా వృద్ధమంత్రి

యుగంధరుఁడు రాజు లేని వత్సరాజ్య ధర్మసింహాసనమున నుదయనరాజును గూర్చుండఁబెట్టి పుణ్యనదీ తోయముల నాతని శిరస్సుపైఁ జల్లి తనపుత్రుఁడు యౌగంధరాయణుని చేతిలో నాతని చేతినుంచి నేఁటి నుండి యీ సింహాసనమును జెక్కుచెదరకుండఁ గనిపెట్టు బాధ్యత నీది సుమా యని కనులు చెమ్మగిల్లగాఁ జెప్పి తప్పుకొనెను."

పూర్వకథయంతయు నొక్కసారి తన కన్నులలో గిరునఁదిరుగగా మహామంత్రి యొకసారి తడికనులు తుడిచికొని సుస్థిరరాజభక్తి ప్రపూర్ణుఁడగు పితృదేవునకు నమస్కరించి యథాస్థానమునకు వచ్చి కూర్చుండి జేవురించినముఖముతో నిట్లనుకొనెను.

అట్టి మహాత్మ్యుని కొడుకుఁజెందిన నే నిటు సహస్రాక్షములతో...వత్సరాజును జూచుచుండఁగా... నా కన్నులుగప్పి యట శత్రురాజ కుతంత్రములా?... ఛూతము!

---

# నాగవనము

"విజయా! విజయా!......"

ద్వారపాలిక విజయ వచ్చి వినయసంభ్రమములతోఁ జేతులు గట్టుకొని మహామంత్రి వద్ద నిలిచెను.

"పాలకుఁడు సిద్ధముగా నున్నాఁడా?"

"చిత్తము... దేవరయానతికి వేచి సర్వసిద్ధముగ నున్నాఁడు. కాని... ఏలినవారితో వేణువనమునకు వెళ్ళిన హంసకుఁడు వచ్చి దర్శనమునకుఁ దొందర పడుచున్నాడు"

"ఏమి—ప్రభువుల యంగరక్షకుఁడు హంసకుఁడా?... వెంటనే రమ్మనుము."

మంత్రి ముఖమంతయుఁగన్నుగాఁ దలయెత్తి చూచెను. హంసకుఁడు చరచరవచ్చి నేలకు వంగి సమస్కరించి తలవంచుకొని నిలుచుండెను.

మహామంత్రి కంఠమును జీల్చుకొని యీ ప్రశ్న వెల్వడెను.

"హంసకా...ప్రభువు నాగవనమునకుఁ బోలేదుగద?"

"చిత్తము...నిన్ననే యావనము జొచ్చినా...రు."

ఎంతయాచినను వాని గొంతు కొంచెము వణఁకెను.

" ఆఁ ఏమి ? అనుకొన్నంతపని యైనదా ? వేగిరా వృత్తులను దూకించి ప్రభువును వేణువనము దాఁటకుండఁ జూత మనుకొన్నాను. పథకము విఫలమైనది. ఇంక నీ వార్తావహుని బంపుట యెందులకు ? గతజలమునకు సేతుబంధనము. అది యట్లుండ నిమ్ము. మన మింకఁ బ్రాణత్యాగములు చేయవచ్చునా ? ఇంకను నేమైన నాశ యున్నదా ? "

"కౌశాంబీప్రజల భాగ్యవశమున నేలినవారు నేఁటికిఁ గుశలముగనే యున్నారు."

"ప్రభువునకుఁ గుశలమేకద — అయిన నేదో కొంచెము విపత్తు సంఘటిల్లిన దన్నమాట—ఏలిక శత్రుల చేతిలోఁ బడలేదు గద ..."

"చెప్పుటకు నోరు రాకున్నది. ఆ యనర్థమే జరిగినది. నిన్ననే పట్టువడినారు."

"ఏమేమీ — ఉజ్జయినీరాజు ప్రద్యోతుని పన్నాగమే పండినదా — వత్సరాజ మంత్రిప్రముఖుల మేధలు గొడ్డువోయినవా ? నిశితబుద్ధిశాలి మంత్రి రుమణ్వంతు డుండగా, అశ్వదళములు వెన్నంటి నడువఁగా నీ దుస్సంఘటన మెట్లు జరిగినది ? "

"మన రాణువయును, రుమణ్వంతులును వెంట నుం

డగా మహారాజుపై నీఁగ వ్రాలియుండునా ? పరిస్థితులట్లు వచ్చినవి. దాయలు త్రొక్కి వచ్చిరి."

"అట్లు చెప్పుము. మబ్బులేకుండఁ బిడుగు పడినది. స్తిమితపడి సవిస్తరముగఁ జెప్పుము."

హంసకుఁ డూర్పు పుచ్చుకొని నెమ్మదిగాఁ జెప్పఁదొడఁగెను.

మొన్న వేఁకువజామున కనుజీకటి యుండఁగ పరిజనమును వేణువనమందే నిల్పి మహారాజు పాటిరేవున నర్మదానదిని దాఁటి గహనమార్గముల సందు చేసికొని నాగవనమును బ్రవేశించినారు. మేమందఱమునుఁ బ్రభువు వారి వెన్నంటియే యున్నాము. జాము ప్రొద్దెక్కినది. మదగంధిర పర్వత మింకఁ గ్రోసెడు దూరమున్న దనఁగా బురదతో నిండిన యొక తటాకమున నెగుడుదిగుడుగాఁ గట్టిన గోడవలె నేనుఁగుల గుంపొకటి బెదురుచుఁ గదియుచు మాకుఁ గాన్పించినది. మేము మా గజయూధమును బరికించి చూచుచుండఁగా దూరమునుండి యొక భటుఁడు రోజుకొనుచు వచ్చి మహారాజుతో "ప్రభూ ! యిక్కడి కొక కూఁతవేటు దూరమున మల్లెపొదలలో నొక యేనుఁగును జూచితిని. తెల్లని దానిదంతములు మాత్రమే పైకిఁ బొడుచుకొని కాన్పించుచున్నవి. తక్కిన

భాగమంతయుఁ గాటుకరాశి. ఈ వింత దేవరతో మనవి చేయుటకు వచ్చితి” ననెను. ప్రభువు పొంగిపోయి నూఱు సువర్ణముల వానికి బహుమాన మిచ్చి మాతో నిట్లు చెప్పినారు. అదియే గజచక్రవర్తి. నీలకువలయ తను వను నట్టి హస్తిరా జుండునని మేము గజశాస్త్రములో బఠించినాము. మీరంద ఱిచటనే యుండుఁడు. మేము ఘోషవతీ ద్వితీయులమై పోయి దానిని లాలించి తీసికొనివత్తుము.” అని వీణను సవరించుచు రెండడుగులు ముందునకు వేసినారు. మే మందఱము నివ్వెఱపడి చూచుచున్నాము. అమాత్య రుమణ్వంతులు మాత్రము తటాలునఁ బ్రభువునొద్దకేఁగి “మహారాజా! దీనిలెక్కయేమి. ఏలికతలఁచుకొన్న వీణను బ్రయోగించి యైరావతమునే పట్టఁగలరు. కాని యొక్క మనవి. ఈ సరిహద్దు భూములు ప్రమాదభరితములు. శత్రుప్రేరితులైన తుంటరు లిందు స్వేచ్ఛగాఁ దిరుగుచుందురు. ఇట్టిచోటుల సాహసము చేయుట పాడిగా”దని బహుమానము విన్నవించిరి. ప్రభువంతయు విని చిఱునవ్వు నవ్వి “అట్టి యేనుగును బట్టకున్న నీ ఘోషవతికిని మా గజహృదయపరిజ్ఞానమునకును సార్థక్య మెక్కడ? ఇట్టి నిరర్థక సందేహములు పెట్టుకొనిన నీ గజాఖేటములో

నింక నానంద మేమున్నది? ఇఁక మీ రెదురాడిన మాపై నొట్టు" అని కచ్చితముగఁ బలికి నీలవలాహక హస్తినుండి దిగి సుందరపాటల తురంగము నెక్కి, అమాత్యునితోఁగూడ రాణువనంతటిని నచటనే యుండుటకుఁ గట్టడిచేసి, యిరువదిమంది కాల్బంటులను, నన్నును కొలఁదిమంది యేనుఁగువేఁటరులను దీసికొని రివ్వున నా యేనుఁగున్న చోటునకు నడచిరి. పోయిచూడఁగా నల్లని సాలవృక్షపు గుబురునుండి తళతళ మెఱయుచు రెండు దంతములు మాత్రము గాన్పించుచున్నవి. ఱేఁడు తటాలున సుందరపాటలమునుండి దిగి యిష్టదేవతలకు నమస్కరించి ఘోషవతి నందుకొనిరి. ఇంతలో వీను లదరి పోవునంతటి బొబ్బయొకటి మా వెనుకనుండి వినవచ్చినది.

అందఱము వెఱగుపడి వెనుదిరిగి చూచుచుండగా నా చెట్లగుబురునుండి యొక మాయాగజము బిరబిర నడచి వచ్చి మాపై బడెను. చూచుచుండగనే యా గజగర్భమును వ్రీల్చుకొని నూర్గురు యోధులు సాయుధపాణులై యుద్ధమునకు సిద్ధపడిరి. మహారాజు, కాలము తప్పి వచ్చినదని చట్టున గ్రహించి వీణను నాచేతి కందిచ్చి కత్తి దూసి "ఔరా ప్రద్యోతుని వంచనా ప్రయోగము. కులపుత్రులారా, వెఱువకుఁడ"ని హెచ్చరించి గుఱ్ఱము

దూషించిరి. సుందరపాటం గమనలాఘవము మా కన్ను లనే మిఱుమిట్లు గొల్పెను. యోధులు చుట్టుముట్టిరి. వారు యుద్ధసన్నద్ధులు. మా కది తలంపని తలంపు. ఐనను వెనుతివియక మన భటులు బుజములలో శక్తి యున్నంతవఱకు స్వామిఋణముతీర్చి నేల కొరగిరి. మహారాజు సమయస్ఫూర్తితో వేటాఱు తునియలుగా నెదురుపడిన మొసగాండ్రనం జెను చెండాడి మిట్టమధ్యాహ్నపు టెండకు డస్సి పుడమికిజాఱి మూర్ఛపోయెం. మోపైన గాయములతో గుఱ్ఱమును భూమిపైం బడినది. ఆవైపు మిగిలిన యోధులలో నొకపాపి యేలినవారు మూర్ఛనుండి తేఱుకొనుటం జూచి మరల తమ కుత్తుక లెక్కడ నొరిపోవునో యని పరుగుపరుగునంబోయి కొన్ని యడవి తీంగలు తెచ్చి సుకుమారములైన స్వామి భుజములను బంధించి కూర్చుండంబెట్టి కరవాలము చేతంబట్టి యూంతకు వెనుకకు బరుగెత్తి వచ్చోడిన నెత్తుటి బురదలోం గాలుజాఱి క త్తిగ్రుచ్చుకొని చచ్చినాండు.”

ప్రాణము లుగ్గబట్టి వార్తవినుచున్న యౌగంధరాయణమంత్రి యొంక వేడినిట్టూర్పు పుచ్చి “ఔరా! భూదేవి కృతజ్ఞత! ఇన్నాళ్లుగాం దన్నులాలించి పాలించిన భర్తను బృథ్వీకాంత గాపాడుకొన్నది గాంబోలు.

ఇట్టిపట్టులనే మనుజుని సుకృత దుష్కృతములు ప్రత్యక్ష మగుచుండును. అభ్యర్థితులను వందనములతో, మిత్రుల నాలింగనములతోఁ బాత్రులను దానములతో మన్నించిన రాజన్యుని బాహువుల కడవితీఁగల బంధనమా? యౌగంధరాయణుఁడు బ్రతికియుండియే వినుచున్నాఁడా! ఏమీ విధివిపరీతక్రీడలు. హంసకా!" అని బరువుగా నేనెను.

హంసకుఁడు మఱల నందుకొనెను:

అంతట నేలినవారి కుంత ప్రహారముచే సొమ్మసిలిన ప్రద్యోతనమంత్రి సాలంకాయనులు అప్పటికి కన్నుఁదెఱచి తమభటులు చేసిన యుపచారమునకు వగచి "వత్సప్రభువుల లతాబంధనములను స్వయముగ నూడ్చి పుచ్చిరి. ఇతర వాహనముల కుదుపు నా స్థితిలో స్వామి భరింపలేరని గాఁబోలు—ఒక పల్లకిలోఁ బరుండఁజేసి యుజ్జయనీ ప్రయాణాభిముఖులై యంతవఱకు నాచేతఁ బ్రాణపదముగఁ గాపాడఁబడుచున్న ఘోషవతిని దీసికొని "ఓయీ! నీవు పోయి యీ వృత్తాంతమును యౌగంధరాయణులకుఁ జెప్పుము" అని చేయివిసరి పల్లకి నెత్తించిరి. నేను గదలలేక చెక్కుటద్దారలు కన్నీటిని దుడుచుకొనుచు ప్రభువువైపు చూచుచుండగా వారును నన్నుఁజేరఁబిలిచి "హంసకా! దుర్విధికి విచారింపకుము. నీవు

మాకు నమ్మినబంటవు. పోయి యౌగంధ రాయణులను జూడుము " అని ముఖముఁ ద్రిప్పుకొనిరి. "

అని గద్గదకంఠముతోఁ జెప్పి హంసకుఁ డూరకుండెను. మహామంత్రి కణకణ వెలుఁగు గాంభీర్యముతో నిట్లు పలికెను.

"మంచిది. నేను గూటఁజిలుకనై మీమాత్రము గూడ మహారాజునకు బానట గాలేకపోఁగా నా సముద్ర గంభీరుఁడు నా పేరు స్మరించి మఱి, బంగారు సంకెళ్ళకుఁ జేతు లప్పగించెనా ? "

చంద్రుని మ్రింగిన రాహు వెన్నాళ్లు పుక్కిటఁబట్టఁ గలఁడో చూచెదఁగాక. హంసకా! నీ వింక విశ్ర మింపుము.



# ప్రతిజ్ఞ

"ఎవరక్కడ ?"

"చిత్తము"

"అవిలంబితముగ మాతృశ్రీవారిని జూడవలయును."

"చిత్తము. మనవిచేసి వత్తును."

విజయ చరచర నంతఃపురములోనికిఁబోయి గడియలోఁ దిరిగివచ్చి రావచ్చు నని మనవి చేసెను.

మబ్బులు క్రమ్మిన యాకసమువంటి ముఖముతో మహామంత్రి బరువుగా నడుగులువేయుచుఁ గక్ష్యాంతరములుగడచి రాచనగరులో నడుగుపెట్టెను.

రాజమాత యెదురుగా వచ్చి మాతృప్రేమ తొలుకాడ మంత్రిని బల్కరించి విశేషము లేమన్నట్లు కనులెత్తిచూచెను. మంత్రి గంభీరముఖములో నేదో యనర్థము చదివి కలవరపడెను.

"చిరంజీవి యేదో దీర్ఘాలోచనములో నున్నట్లున్నది!"

"అమ్మా! యేమున్నది. సాగరగర్భమువలె రాజకీయజీవితము నిరంతరాందోళన పూరితముగదా"

సాధారణముగ నంతే. కాని యౌగంధరాయణ సురక్షితమైన వత్సరాజ్యమున నామాట చెల్లదు. కను కనే ఆయుష్మంతుఁడు నిశ్చింతముగ ఘోషవతీ మధుర ధ్వనిలో మృగయాఖేలనములోఁ బ్రొద్దు పుచ్చుచు న్నాఁడు...... అన్నట్లు అబ్బాయి వేటకేఁగి నాల్గు దినములైనది ఎప్పుడు వచ్చునో కబు రేమైన వచ్చెనా?”

మహామంత్రి చిక్కని విషాదమును బుక్కిటఁబట్టి గరళమును బై కుమియలేక లోనికి మ్రింగలేక చిక్కుపడు పరమశివుని యవస్థలోఁబడెను. ఒక త్రుటి యాగి

“ఇంకను నాలుగు రోజులు పట్టవచ్చు నను కొందును—”

“కారణము?”

“ఉదయనప్రభు నౌన్నత్యమునకుఁ గన్నులు కుట్టిన శత్రురాజ కుతంత్రములు”

“నాయనా, యింక దాఁపరిక మెందులకు? ఆయు ష్మంతున కేమైనఁ గీడు మూడినదా? స్పష్టముగఁ జెప్పి వేయుము”

“అమ్మా, ఏమి చెప్పను — విధి విపరీతమైనది. పగతుల కపటప్రయోగము ఫలించినది. ప్రభువు ప్రవా నములో నున్నారు.”

" అయ్యో... హతవిధీ.. "

"అమ్మా, సోదరులకు మీరు దాటించిన విపత్తుల కంటె నిది యెక్కువగాదు. క్షత్రియాణిగా మీరీ మనః ఖేదమును మనస్సునఁ జిక్కఁబట్టక తప్పదు.

" నాయనా, ఈ వార్ధకమున మిమ్ముల నిద్దఱను జూచుకొనుచు సంతోషముగ నిర్విచారముగఁ గాలము గడిపివేయుద ననుకొన్నాను. చల్లని నీ రాజనీతిగొడు గులో నాకొడుకు సిగపూవు వాడ దనుకొన్నాను. నీ బుద్ధిని వంచించి నీ కన్నులనే కప్పి పులినోటి కండవలె వత్సరాజును బలిమిమైఁ గొంపోవుటకు పగతుఱ కెన్ని వేల గుండెలు వచ్చినవి? —

నీవు చూచుచుండగనే యీవత్సరాజమాత యాఱని కడుపుఁజిచ్చుతో నవసి నవసి నశించిపోవలసిన దేనా? యన్య మార్గమేమైన నున్నదా? వెంటనే చెప్పివే యుము."

రాజమాత తుదివాక్యములకు మహామంత్రి క్రక్క దలిపోయెను. యౌగంధరునినుండి తనవఱకు సరసరము నను బ్రాకుచున్న రక్తములోని రాజభక్తి సలసల కాఁగిపోయినది. రాజులేని కౌశాంబీ రాష్ట్రప్రజల హాహా

కారములు తనచెవులలో గింగురులు పెట్టినట్లయ్యెను. దృఢనిశ్చయముతో మంత్రి యిట్లనెను.

"అమ్మా! పలుమాట లేల? యిటు వినుఁడు. శత్రువు తమ్ముని ద్వీపద్వీపాంతరములకుఁ గొంపోయినను వాని కన్నులలోఁ గారముచల్లి ఆరు మాసములలో నా ప్రభువును విడిపించి తెచ్చి మీ యెదుట బెట్టెదను. ఇందులకుఁ దప్పిన నా పేరు యౌగంధరాయణుఁడు గాదు. ఇఁక నీ రాష్ట్రములో నడుగు పెట్టను." రాజమాత వద్ద సెలవుఁ దీసికొని యాతఁడు సభాభవనమునఁ బ్రవేశించెను. ఉపాయాపాయ సహస్ర సంఘర్షణములతో నాతని మస్తిష్క మొకతుఫాను సముద్ర మైపోయినది. మహామంత్రి యంతరాత్మ గాఁబోలు—నీడవలె నెదుట నిలిచి ప్రశ్నించుచున్నది.

"కపటమా? ఖడ్గమా?"

"కపటము...అశక్తుల పని...కత్తులు దూసి...... గజాశ్వదళముల నుఱికించెదను."

"ప్రద్యోతనుఁ డంతహీనబలుఁడు గాఁడు. పైగా నిపుడు మఱింత బలపడి యెదురుచూచుచుండును."

"వంచనమునకు వంచనమే యౌషధమా?"

"కుటిలుల యెడ నార్జవము తగదని వేత్త చెప్ప వలెనా?"

"మంచిది .. కాని ... ఉపాయము?"

ఒక బ్రాహ్మణుఁడు పరుగెత్తుకొనివచ్చి మంత్రితో చెప్పెను.

"మహామంత్రీ — ఇప్పుడొక విచిత్రము జరిగినది. మహారాజు జన్మ నక్షత్రమున సాధారణముగా నంతి పురిలో జరుగు బ్రాహ్మణ సంతర్పణమునకు నేఁడొక పిచ్చిబాపఁడు వచ్చినాఁడు. కూరుచుండి భోజనము చేయక పంక్తులలోఁ దిరుగుచు "తినుఁడు తినుఁడు. కడుపుల నిండఁ దినుఁడు. ఈపైని మీరాజున కంతయు క్షేమమే" అని యొక్కసారిగా మాయమై తన దుస్తుల నట విడిచెను. ఇవిగో, కుతూహలమున నవి యచటికిఁ దెచ్చితిని. ఇది యొక గడ్డికుళ్ళాయి. ఇది నారకంచు కము. మిగిలినది చినుగులదోవతి" అని మంత్రి యెదుటఁ బెట్టి, తక్కిన బ్రాహ్మణు లతనిని సాక్షాత్తు వ్యాస మహర్షియే యని చెప్పుకొనుచున్నారు." అని పల్కి వెడలిపోయెను.

మహామంత్రి యెదుట నొక మెఱపు మెఱసినట్ల య్యెను. పాండవుల భారతీయజ్యోతికిఁ దుట్టతుది ప్రతినిధి

ఉదయన ప్రభుఁడుగదా! వ్యాసుని పాండవపక్షపాత మీరూపున నమృతాశీస్సులు కురిసి నాకుఁ గర్తవ్యమును జూపి తిరోహితమైనదిగాఁబోలు సందేహములేదు. మేలు మేలు. ఈ యుపాయ మప్రతిహతమైనది. ఇవి పిచ్చివాని దుస్తులుకావు. వత్సరాజ్యవిజయపతాకలు.

---

# ఉజ్జయిని

"ఇదియొక మహాసమస్య. ఈడువచ్చిన యాడుబిడ్డ యింట నుండగా నెంత యానందమో యంత విచారము. చేతులారఁ బెంచిన పూలచెట్టు ఎదిగి పూచి పరిమళములు చిమ్ముచు నింట నడచుచున్నట్లుండును గాని యా పూలు త్తమ హస్తసత్క్రి ష్తములగునా — లేదా యని లోలోపల నేదో సెగులు! చిత్రము! ఉజ్జయినీరత్నసింహాసమునఁ గూర్చుండి యంగబలమున కర్థబలమునకు నెట్టి కొఱంత లేక కనుసన్నల రాజాధిరాజులఁ ద్రిప్పఁగలిగిన నాకే పుత్రికావివాహ మింతకఠిన పరీక్షగాఁ బరిణమించినపుడు సాధారణ గృహస్థు లెంత తపింతురో గదా!"

ఇది ఉజ్జయినీ పురాధీశ్వరుఁడు మహాసేనుని చింతాప్రవాహము. రాజభవనమునకు ముందున్న చతుష్క చంద్రకాంత మంటపమున జలతారు పట్టుదిండ్లపై నొరగి యిట్లాలోచించుచున్న యాతని యాహావాహిని కడ్డు వచ్చి యొక వృద్ధకంచుకి యిట్లు విన్నవించెను:

"మహాప్రభూ, కాశీరాజదూతగా వచ్చి జైవంతయ్యగారు ఏలికదర్శనము కోరుచున్నారు."

"ఏమి జైవంతి వచ్చెనా? మంచిది. మన సంస్థాన గౌరవమునకుఁ దగినట్లు మర్యాదలు జరిపి హిమానీ భవనమున విడియించి యాతని యవసరముల శ్రద్ధగాఁ జూచుచుండుఁడు. మధ్యాహ్నము మమ్ముఁ జూచుటకు రావచ్చు నని చెప్పుఁడు."

"చిత్తము"

"సుమతీ, ఇప్పు డీతని యాగమన మెందులకో యూహించితివా?"

"ఏమున్నది, ప్రభూ! తమ యింటనున్న యనర్ఘ కన్యారత్నముకొఱ కభ్యర్థులై పలువురు రాజకుమారులు చేతులు చాచుచుండుట నీనడుమఁ బరిపాటిగఁ జూచుచున్నాముగదా!"

"నీయూహ నిజమే కావచ్చును."

నిన్నటివఱకు మాగధులు, వాంగులు, సౌరాష్ట్రులు శౌరసేనులును నమ్మాయి నడుగవచ్చి వెడలినారు. ఇప్పు డందులకే ఈ కాశీదూతయును గావచ్చును. ఇటు కుమారిని జూచి యటు వారిని దలఁచుకొనఁగా గెంపు ముందు గాజురాలన్నట్లు ఎటువైపును మన సెక్కుట లేదు." ఒకింత యాగి మహాసేనుఁడు నవ్వి

"ఇఁక నింతలో రాకుమారికి వివాహము చేయులే

మేమో. అన్నియుఁ బ్రశ్నలే — మంచి యాభిజాత్య ముండవలయునుగదా. తరువాత నమ్మాయి సౌశీల్య సౌం దర్యములు కన్నులకద్దుకొను స్నేహశీలికావలెను. పిమ్మట స్త్రీజన మభినందించు రూపాతిశయమును, నాటిరాజు లలో మేటియనఁదగిన శౌర్యోన్నతియును లేకున్న నేమి లాభము? ఇన్ని యొక్కచోఁ గలసిరావలయు నన్న నంత సుసాధ్యము కాదుగదా — ఈ చిక్కు నెవరు విడఁదీయుదురో తోఁచకున్నది."

ఏలినవారి కున్న గుణసంపత్తి యంతయు సర్వత్ర దొరకవలయు ననిన సాధ్యపడు విషయమేనా మహా ప్రభూ? ——————ఇంతకును...కళ్యాణతార త్రోసికొని రావలయును. అప్పుడు దైవమే సర్వవిధములఁ దోడ్ప డును."

"నీవన్నదే నిజ మనుకొందును ... సరియేకాని మహారాణియేమి చేయుచున్నదో—పుత్రికా వివాహ విషయమున నామె యభిప్రాయములుకూడ వినఁదలఁచు చున్నాను."

"చిత్తము. ప్రస్తుత మమ్మగారు రంతిపురిలో రాజకుమారి వాసవదత్తమ్మగారితోఁ బ్రసంగించుచున్నారు. స్నేహితు రాలు కాంచనమాల వీణావాదనము చూచి తామును

వీణసాధింపవలయునని రాకుమారి మిక్కిలి పట్టుదలతో నున్నారు. "వైతాళికురాలగు నుత్తరవద్ద నారదవీణ నభ్యసించుచున్నావుగదా! క్రమముగాఁ బ్రావీణ్యము కలుగును. ఇంకను చింత యెందులకు?" అని యమ్మగారు సంతుష్టిపడుచుఁ జూడఁగా 'నీ సాధారణ ప్రవేశము చాలదు. ప్రౌఢపాండిత్యముగల గురువునొద్ద నభ్యసించినఁ గాని లాభములే' దని యమ్మాయి పట్టుబట్టుచున్నారు. మహారాజ్ఞి నవ్వి యుత్తరవారింట నడుగిడుటకు సిద్ధముగ నుండగా నీవల్లకీ పాండిత్య మెందులకమ్మా." అని పల్కగా నమ్మాయి గునియుచు 'నాపెండ్లి కేమి తొందర? వీణ సాధింపనిదే వివాహము తలఁపనైనఁ దలఁపనని' భీష్మించుచున్నారు."

"అమ్మాయిది మా పోలిక. ఒక విషయమై పట్టు బట్టిన నది నెగ్గునంతవఱకు నిద్రపోదు. కన్నతల్లి వయో రూప సౌశీల్యములకు నీ వీణా సాధనము కూడఁ గలసి వచ్చెనా నిజముగ వెన్నెల పరిమళించినట్లుండును. కాని యట్టి లోకోత్తర గురు వెవరు?"

ఒకభటుఁడు పరుగెత్తుకొని వచ్చి—

"ప్రభూ, ఉదయనులు ......"

"ఏమేమీ! పూర్తిగాఁ జెప్పుము. ఉదయనరాజు?"

"మన సాలంకాయన మంత్రికిఁ బట్టుబడినారు."

"నేను నమ్మను"

"మహారాజా, గాయపడిన యుదయనులను బల్లకిలో నెక్కించుకొని సాలంకాయనులు జవాశ్వములు పూన్చిన రథములో వచ్చి యీ విజయవృత్తాంతమును సత్వరముగ నేలినవారితో మనవిచేసి రమ్మని నన్నుఁ బంపినారు."

మహాసేనుఁ డాశ్చర్యముతో దిగ్గునలేచి యిట్లనెను.

"సహస్రానీకపౌత్రుని, శతానీకపుత్రుని, కౌశాంబీ రాజును, ఎదిరించి పట్టుకొనుట యంత తేలికపని యనుకొనను."

"నిజము మహారాజా, ఉదయనులను బురస్కరించుకొని మంత్రిగారీపాటికిఁ గోట మొగసాలవద్దకే వచ్చి యుందురు."

"వేయికన్నులవాఁడు యౌగంధరాయణుఁడు బ్రతికి యుండఁగానే వత్సరాజు బందిగాఁ బట్టుపడె నన్నచో నిది వింతలలో వింతగాక మతేమి?— ఏది యసంభవమని మాసర్వశక్తులను గేంద్రీకరించి దేనిని సాధింప నింతవఱకు నిర్నిద్రముగఁ గృషి సల్పితిమో యీ కార్యమింత యశ్రమముగ, ననాయాసముగ ఫలించె నన్నచో నాసంతోషమునకు మేర యున్నదా?—

ఇఁక మనగూఢచారులు నిర్విచారముగ నిండ్లవద్దఁ గూర్చుండవచ్చును. అక్షౌహిణీ పరంపర నిరాక్షేపముగ విశ్రాంతి ననుభవింపవచ్చును.

కోటకొత్తళములపై వెంటనే విజయపతాక లెత్తింపుఁడు. మూఁడు రోజులు వడితగ్గని యుత్సవములతో నగరవీథులు నిండిపోవలయును, తెలిసినదా ?"

వేత్రభటుఁడు ససంభ్రమముగ వచ్చి యొక చక్కని వీణను మహారాజు ముందుపెట్టి సవినయముగ నిట్లనెను.

"ప్రభూ, నాగవనవిజయములో నీవీణ మేలివస్తువఁట—ఉదయనులు లాలించు నీ వీణియను సాలంకాయను లేలినవారికిఁ గానుక పెట్టుచున్నారు."

"ఓహోహో! ఇదియా ఘోషవతి. కొనగోళ్ళతో నిట్టెయనినఁ బారిజాత మధువులను, బూలవాసనలను, మహేశ్వర జటాజూట శశికళా సుధాబిందువులను జాలువార్చు వీణాసరస్వతి యిదియేనా! కారుమబ్బులవలె గర్జించు మత్తమాతంగములను దువ్వి తోడ నడపించునైపుణ్య మీ వల్లకీరత్నము సొమ్మేనా ? బళీ! ఇప్పుడు మేము మహాసేనులము. ఇట్టి విజయలబ్ధ మాణిక్యములతో నానందించుటయే నిజముగ మావంటివారికి ధన్యత !"

ఓయూ, ఈశుభవార్త నతిత్వరితముగ నంతఃపుర

మున కందించి వీణాప్రియయగు రాకుమారి కీ ఘోషవతి మా బహుమానమని యిచ్చిరమ్మ—

ఇది నా యుపాయంగుగాని —— గురువులేని ఘోషవతి నమ్మాయి యేమి చేసికొనును ?......

కంచుకి సుమతి యందుకొని " ప్రభూ ! వత్సరాజన్యులం నేటి వీణాకోవిదుల లో నగ్రగణ్యులంట—"

" సందేహమేమి ? ఆవీణా వ్యసనమే లోకములో నతని కీర్తిని సుప్రతిష్ఠిత మొనర్చుటతోపాటు మన కాతని బట్టి యిచ్చినదికూడ—

ఆతనికిం గొన్ని తలతిక్కలే లేకున్న నేడంతటి రాజకుమారుండేండీ ? —భరతవంశ్యుండ నని వల్లమాలిన యాభిజాత్యము — దానికిందోడు రూప లావణ్యాతిశయ గర్వము — గజహృదయపరిజ్ఞాతనను పట్టరాని యహంకారము. పైగా నన్ను మహాసేనుండనుటయే కిట్టదట యా మొనగానికి — కనుక నే ... మాయా గజ ప్రయోగముచేసి యాతనిని బట్టికొని మా ప్రతాపముం జూపించితిమి. అది యట్లుండనిమ్ము. మనుజరత్నమును గుప్పిటంబట్టితిమి దానిని జక్కగ వినియోగించుకొనుట లోనే మన వివేక మున్నది. ఎట్టైన నాతని గజహృదయ మంత్రమును, వీణావాదన కౌశలమును మనము చేజి

క్షించుకొనినప్పుడు మనకృతార్థత — కాని, యీ యవమానఖేదమున మనలను దిరస్కరింపకమానఁడు— దానికొక మనిశితోపాయముఁ గనిపెట్టవలయును. సరియే—నీవింకఁ బోయి భరతామాత్యునితో నామాటగా నిట్లు చెప్పుము.

పాఁతపగలను బూర్తిగా మఱచి వత్సరాజును రాజోపచారములతో సేవింపవలయును. చూపులలో గ్రహించి యాతని యక్కఱలను వెనువెంటనే తీర్చవలయును. వేయేల! బద్ధుఁడని కాక బంధువన్నంత ప్రీత్యాదరములతో సుఖమయావాసభవనములలో నుంచి సేవింపవలయును. బందికీ రాజలాంఛనము లేమని భరతామాత్యునకు రుచింపకపోవచ్చును. మంత్రభవనమున నన్నొకసారి కలసికొనవలెనని యాతనితోఁ జెప్పుము." అని ప్రద్యోత మహారాజు తన యవరోధములోని కేఁగెను.

---

# ఘోషవతి

సాయంకాల మైనది. చల్లగాలి తిరిగెను. పడమట క్షణక్షణమునకు రంగులు మార్చుచున్న సంధ్యా సౌందర్యమునకు మెచ్చుచున్నట్లు తోఁటలోని నారికేర వృక్షములు తల లూపుచున్నవి. ఎత్తుగాఁ గట్టి తీర్చి దిద్దిన పుష్పమండపములనుండి సన్నజాజులు, మల్లెలు, శేఫాలికలు అప్పుడే కన్నులువిచ్చి చూచుచున్నవి.

ఆపుష్పవనమధ్యమునఁ బ్రకృతము వత్సరాజును బంధించిన మనోరమా భవనము. భవనమున కుత్తరముగఁ బూలతోఁట నానుకొని యొక బలమైన ప్రహరీగోడ. దాని వెనుకనే ప్రద్యోతమహారాజుగారి యంతఃపురసౌధములు. అందు రాజకుమారి వాసవదత్తాదేవి సౌధము ప్రహరికి దగ్గఱ. లాంతివా రెవ్వరైనఁ బ్రభుత్వపు టతిథిగృహములం దుండవలసినదే. కాని యుదయనరాజునందలి ప్రత్యేకగౌరవముచే మంత్రుల కంత యిష్టము లేకపోయినను మహారా జతని నిందే విడియింప నాజ్ఞాపించెను.

ఉదయనమహారాజు ఉజ్జయినికి వచ్చి సుమారు పది రోజులైనది. నాగవన సంఘర్షణమునందలి గాయములు మానఁదొడఁగినవి. కొంచెము కోలుకొని వత్సరాజు

చల్లని వేళలఁ దోఁటలోఁ దిరుగ నారంభించెను. అతఁడు కూర్చున్నఁ బరిచారకులు. నిలుచున్న భట పరంపర. అది రాజమర్యాదయో ఖైదీని గనిపెట్టి చూచు నుపాయమో యాతనికిఁ దెలినదిగాదు. ప్రతిసేవకుఁ డొక్కొక్క బంగారుసంకెల! వేఱే చెఱయని బొట్టువెట్టి చెప్పుట యెందులకు?

వత్సరాజు నెమ్మదిగఁ బోయి యొక విరజాజి మండపము చెంతఁ జలువరాతి వేదిక మీఁదఁ గూర్చుండెను. సువర్ణచ్ఛాయతోఁ దొనకిసలాడు నాతని సుందరవదనము వాఁడి, యాతని మనసులోని యవమాన రేఖకుఁ జివరి యంచువలె నుండెను.

అతఁడు తన కౌశాంబీ రాజభవనమునం దే యుండెనా — అది యాతఁడు ఘోషవతిని జేఁబూని యమృత వాహినులు పలికించు వేళ. ఎంతలో నెంత వ్యత్యస్తమైనది! లోపల నింకను సలపరించు గాయములకుఁ గాని ఆప్తజన ప్రవాసమునకుఁ గాని, తుదకు వత్సరాజ్యపరిత్యాగమునకుఁ గాని యాతని మనము చెదరలేదు. కాని...మాతృమూర్తి ఘోషవతితోఁ దన్ను దూరముచేసిన నింకఁ దన కేమి మిగిలినది? వీణ లేకున్నఁ

డానెవరు ? ఏమియుఁ గాఁడు. వట్టి చైతన్య హీనమైన రక్తమాంసప్రతిమ —

ఈ మణిమయసౌధములు, సుమనికుంజములు, రాజలాంఛనములు వట్టి విడంబనములుగాక మఱేమున్నది ! ఒకవీణ చేతికిచ్చి చెట్టుక్రింద నివాస ముండుమన్నను ఆహారపానీయము లందకుండఁ జేసినను, కిమ్మనకుండ నాతఁడా కళాతపస్యలో మునిఁగిపోఁగలఁడు.

" అబ్బ — దుర్భరము, ఘోరము "

ఉన్నట్టుండి తేళులు గుట్టినంత, జెఱ్ఱులు ప్రాఁకినంతగా నా కళాజీవి చీదరించుకొనెను. చెంతల నందందు నిలచి యున్న పరిచారకులలో నొకఁడు వేగముగఁ బరుగెత్తుకొనివచ్చి " ఏమి వత్సప్రభూ " అని చేతులు గట్టి నిలుచుండెను. ఉదయనరాజు ప్రశ్నార్థకముగాఁ దలయెత్తి ' ఎక్కడ నుండిరా, యీ కఠోరధ్వనులు ? చెవులు చిల్లులుపడుచున్నవి. ' అని కన్నులు చిట్లించుకొని పల్కెను. పరిచారకుఁ డాశ్చర్యముతో నాలుక కఱచుకొని

" దేవరా ! ఈప్రక్క సౌధము రాజకుమారి వాసవదత్తమ్మగారిది. వైతాళికురాలు ఉత్తర వీణ నేర్పుచున్నది. అక్కడ వీణియ మీటుచున్నారుగాని — యింకేమియు లేదు దొరా ! "

అంతవఱకు నవ్వి యెన్నాళ్ళైనదో గాని — వత్స రాజపుడు పక్కున నవ్వి " ఈ యంతఃపురమువారి కళాభిరుచి యింతటిదా? కౌశాంబీ రాజభవనము మాకెంతదూర మైపోయినది? అచటి పంజరములలోని రాచిలుకలు వర్ణములు పాడును. శారికలు మధురగీతము లాలపించును. పవనాందోళిత వృక్షశాఖలనుండి హిందోళలు విన్పించును. ఏమిలాభము? అది యంతయు నొకకల. ప్రద్యోత రాజబందిగా... నిప్పటి కిది యథార్థము!" తళతళ మెఱయు నాతని యుజ్జ్వల నేత్రములలో వార్ష సంధ్యారుణ రేఖ లొక్కసారి పాఱాడెను.

"ఓయీ! సాయంకాలమున మంత్రి నొకమాఱు చూడఁదలఁచుచున్నాను."

"చిత్తము, వెంటనే పోయి మనవిసేయుదును" సేవకుఁడు చరచర నడచి రెండు గడియలలో మంత్రి సాలంకాయనునితోఁ దిరిగివచ్చెను.

తన యేర్పాట్లలో నేమి యపచారము జరిగినదో యని యమాత్యుఁడు కళవళపడుచు వత్సరాజును సమీపించి "వత్సప్రభూ, కుశలమా? ... దేహములో నస్వస్థత యేమియు లేదుగదా" యని పృచ్ఛించెను.

వత్సరాజు దిగ్గునలేచి, తత్క్షణమే యీభవనము

నుండి మానివాసము మార్చి వేయవలయును. ఒక నిము
సమేని యుండ నిందుండ జాలము' అని పల్కెను.

మంత్రి సాశ్చర్యముగా నిల్లనెను.

"ఇందలి లోప మేమియో తెలియనేరకున్నాను."

"ఆలోపము మీరుగ్రహించునట్టిది కాదు. అసలది మీదృష్టిలో లోపమే కాకపోవచ్చునేమో — దానికి వ్యాఖ్యాన మెందులకు? వేఱొక చోట నన్నుంచిన నా హృదయతాపము చక్కఁబడును."

"తమరు సెలవిచ్చినది నిజమే కావచ్చును. కాని — మేము రాజభృత్యులముగాని స్వతంత్రులము కాముగదా. తమ కిచ్చటనే నివాసము కల్పించవలసినదని మాకు మహారాజాజ్ఞ."

"వారి బాహ్యదృష్టికి మాకిచట సర్వసౌకర్యము లున్నవని తోఁచియుండవచ్చును. కాని వేఱొక దృష్టిలో మాకిచట దుర్భరముగా నున్నది. మార్పు చేయక తప్పదు."

"తమ కోరిక మహారాజుతో మనవిచేయుదును. కాని కారణము చెప్పకుండ వారెట్లు సమ్మతింతురు?"

మంచిది. అప్రియముగ నుండునని చెప్పలేదు. తప్పని సరియైన వినుఁడు.

"నేను వీణాప్రాణినని మీకుఁదెలియనిది కాదు. ఇంత వఱకు నేను వీణ మాటయే మఱచి పరధ్యానముగా నుంటిని. ఇపు డెవరో యీచెంత వీణతీసి శ్రవణదారుణముగ వాయించుచున్నారు. నే నెట్టి నరకమునైన సహింతును గాని యీ కళాపచారమును మాత్రము భరింపలేను. శత్రుహస్తగతుఁడనై చెఱలో నున్నందులకుఁ గూడఁ గలుగనంతటి ఖేదము నాకీ వీణా వికృత ధ్వనులలోఁ గలుగుచున్నది. ఈవిశాల విశాలా రాజ్యములో సుశిక్షితులైన సంగీతాచార్యులే మృగ్యమయినారా? మహావైభవోపేతులు మీ మహాసేనుల దివాణములోఁ గళల మన్నన యింతేనా? ఇందులకేనా నాకన్నతల్లి ఘోషవతిని గొనిపోయి వారి పాదముల చెంతఁ బడవేసిరి?... అది సరియే గాని — ఒక్కసారి ఘోషవతిని నాకుఁ జూపింపఁగలరా?"

ఆ కళైకజీవి హృదయవేదనకు మంత్రి కదలిపోయెను. పిమ్మట నాతని పెదవులపై సాభిప్రాయమగు దరహాసమొకటి దొరలి చట్టున నచటనే యదృశ్య మయ్యెను. ప్రద్యోతభరతామాత్యుల పథక మింతత్వరలోనే ఫలోన్ముఖమైనందుల కాతఁ డాశ్చర్యపడి వత్సరాజుతో నిట్లు పలికెను.

" వత్సప్రభూ, తక్కిన విషయము లట్లుంచి మీ వేదనను సానుభూతితో నవగాహనము చేసికొనఁగలను. కాని వీణనుగొనివచ్చుట మాత్రము దుస్సాధము. విజయ లబ్ధమగు వస్తువును విజేత కప్పగించుట మావిధి. ఆ వస్తురత్నము ప్రస్తుతము మా రాజకుమారి యధీనములో నున్నది. ఆమెకు వీణావాదన మనిన నాహార పానీయము లక్కఱలేదు."

వత్సరా జాశ్చర్యముగ వినుచు నిట్లనెను.

" నావంటి కళాజీవి వేఱొక రిచట నున్నారని వినుటకు మిక్కిలి సంతోష పడుచున్నాను. కాని — అసమర్థుల యాచార్యకములో నామె సుడులు దిరుగును గాని వీణామాధురీ శిఖరముల నందుకొనఁ జాలదు. ఆమెకు ఘోషవతి యెందులకు? ఆమె కేకాదు. ఈ మహీమండలమున నెవ్వరును ఘోషవతీ మధుర హృదయమునఁ జేయి పెట్టలేరు. నేనీ బంగారు సంకెలలందును, ఘోషవతి యాయంతఃపుర కారాగారమునందును జివికి పోవలసినదే." ఒక యనంత నిస్పృహాలో వత్సరాజు వేఁడినిట్టూర్పు పుచ్చి యూరకుండెను.

ఆయదను చూచి సాలంకాయనమంత్రి యిట్లందుకొనెను.

"ఉదయనప్రభూ, తమ రన్యథాభావింప కున్న నొక మనవి. ఆ యునమర్థ వై తాళికురాలికంటె తమరే యూవీణాచార్యకము నన్నించిన దమకుఁ బ్రియమైన ఘోషవతీ నిత్య సన్నిధానము సిద్ధించును. మా రాజ భవనమునఁగూడ నొక కళాజ్యోతిని వెలిఁగించిన గౌర వము దక్కును. తమ కంగీకార మైనచో నిపుడే మహా సేనులతో మనవిచేసి వత్తును."

వత్సరాజునకు మొదటఁ గోపము వచ్చెను. శత్రు రాజపుత్రికకు దివ్యగాంధర్వ విద్యాప్రదానమా? యను తిరస్కారభావము రేకెత్తెను కాని వెనువెంటనే యొక మాధురీ రేఖ మనసులో నేమూలనో తలయెత్తి ప్రసన్న భావము కల్గెను. 'ఈ పాషాణప్రాయమైన నిర్బంధ జీవి తములో నీ గాంధర్వ వ్యాసంగము కొంతతృప్తి. ముఖ్య ముగ ఘోషవతి చేతికి వచ్చును. దానితో నీ మనఃఖేదము లన్నియు విగళితములగును. కానిమ్ము' అనుకొని యాతఁడు మంత్రితో నిట్లనెను.

"ఇది యెట్లు పొసఁగునో తెలియకున్నది. ఏమనిన వీణాభ్యాసమునకు మాకుఁ గొన్ని నిబంధనములున్నవి. గర్వితులకును గురుపాపులకును నీవిద్య గఱప రాదని మా ప్రతిజ్ఞ. మొదటి నియమ ప్రకారము మాగురుత్వ మంగీక

రించినవారు ప్రారంభములో గురునకుఁ బ్రణామము చేసి మఱి వీణను ముట్టవలెను. అది మీ మహాసేన పుత్రిక కిష్టమగు నని తలంపను. రెండవ నియమము మీ రాజకుమారికిఁ గష్టము కల్గింపవచ్చును. అది మీరే నిర్ణయించుకొని తదనుసారముగఁ బ్రవర్తింపవలెను."

మంత్రిముఖము వికసించెను.

"మా రాజకుమారి సుగుణపరిమళములో నహంకారవాసన మచ్చునకేని దొరకదని మాకు నిశ్చయమే. ఇఁక రెండవ విషయమును మాకు వదలివేయుఁడు. యథోచితముగ మే మావ్యవహారము చూచుకొందుము."

"మంచిది. నియమములకు లోఁబడి గాంధర్వము కోరినచో మాకభ్యంతరము లేదు."

మంత్రి సంతృప్తిగ బయలుదేఱి రాజాంతఃపురము వైపు నడచెను.

వత్సరాజు భావనాపరంపరలో విశ్రమించెను.

మఱునాఁటి యుదయమున వత్సరాజు స్నాన ధ్యానాదికము ముగించిన తరువాత సేవకుఁ డొకఁడు వచ్చి

"వత్సప్రభూ, ఉద్యాన చంద్రశిలా మండపములోనికి దయచేయవలసినదని యమాత్యుల విన్నపము."

చిఱునగవుతో నాతఁడు మండపము వద్దకు వచ్చెను.

మండపమధ్యమున నొక సన్నని మబ్బురంగు పట్టు తెర వ్రేలాడుచున్నది. తెర వెనుక సన్నని వీణాశ్రుతి. ఆచార్యపీఠము నెదురుగ ఘోషవతి గొసెన విప్పి పూజగా నిడిన రెండు మల్లెపూలతో నిలిపియున్నది.

తల్లిని జూచిన బిడ్డవలె నాతని మనస్సుప్పొంగినది. వీణకు నమస్కరించి పీఠముపైఁ గూరుచుండెను. తెరలోనుండి దోసెఁడు సన్నజాజిపూలు సన్నని కంకణ ధ్వనులతో నాతని మృదుల పాదములపై వచ్చిపడెను. తెర నీడలో రెండు సుకుమారహస్తములు జోడించి వంగిన జాడ కాన్పించెను. వత్సరాజు ఖిన్నహృదయము స్విన్నమై వీణ నందుకొనెను. సరళీస్వరములు, జంట స్వరములు, గీతములు, తన ప్రత్యేక ధోరణిలో స్పృశించి వదలగా తెరవెనుక వీణ వాని పునరావృత్తిలో మెఱుగు మెఱుగుగాఁ బలికెను.

వత్సరాజు కన్నులు పెద్దవి చేసి యించుక తల యూఁచి యానాఁటి పాఠమును గట్టిపెట్టెను. దినములు దొరలినవి. వారములు నడచినవి. పక్షములు రివ్వు మన్నవి. నెలలు గిఱ్ఱునఁ దిరిగినవి.

ఆనాఁడు ఘోషవతి శివమెత్తినట్లు మ్రోగుచున్నది. సరస్వతి కచ్ఛపి, నారదుని మహతి, తుంబురుని కలా

వతి, త్రివేణీ సాగర సంగమము వలె ఘోషవతిలోఁగలసి వచ్చి అమృతవాహినుల నెగఁజిమ్ముచున్నవి. పరిసరోద్యానమున సంపెఁగలు పులకించినవి. మల్లెలు నిట్టూర్చినవి. మాధవీ మాలతులు నాట్యమాడినవి. ఆసమయమున నొక గాలిపొరవచ్చి మధ్య యవనిక నల్లలాడించెను. పుంభావ సరస్వతివలె యమోఘముగ వీణవాయించుచుఁ గన్నులరమోడ్చిన వత్సరాజు మదనమోహనమూర్తి రాజకుమారి కన్నులలోఁ దళుక్కున మెఱసెను. అంతవఱకు గురువుగారి ప్రతిరాగకళను మనోమోహనముగ ననువదించు వాసవకుమారి సుకుమారాంగుళులొక్కసారిగా నిలిచిపోయినవి. ఆమె వీణ మూఁగవోయినది. ఈ రసభంగమునకు వత్సరాజు చకితుఁడై విసరుగా వీణను క్రిందనుంచి పట్టరాని కోపముతో

" చేతఁగానివారికి విద్య చెప్పుట యొక మహాపచారము. ఇన్నాళ్ళకృషి బూడిదలో పోసిన పన్నీరైనదా" — అని తెరఁజిమ్మివైచెను. వాసవదత్త దివ్యసుందరవిగ్రహము వత్సరాజును నివ్వెఱ పఱచెను. ఒకగడియ యిరువురును నిశ్చేష్టులై మాటలు రానట్లుండి పోయిరి. ఒక్కసారిగా నిరువురికి నవ్వువచ్చెను.

"మీముఖము చూడనంతవఱకు వీణ వాయింప గల్గితిని. చూచితిని. చేతులాడ లేదు. ఈదోష మెవరిది ?"

'నీకుఁ బాటమాత్రమే చెడినది. నాకు మాటలు పోయినవి. ఈ తప్పిద మెవరిదో ?' అని నవ్వుచు నుదయనరాజు పూర్తిగాఁ దెరను లాగివైచెను. మధ్య నున్న ఘోషవతి మధురగాంధర్వ హృదయము జల్లునఁ బులకించినది.

# పిచ్చివాఁడు

"వెఱ్ఱి చంద్రుఁడు వెడలినాఁడు
కఱ్ఱి మబ్బుల చెంతకు—
గిఱ్ఱు గిఱ్ఱున తిరిగి నెలనే
జుఱ్ఱివేసెను మబ్బులు—
జడలలో జడముడులలోపల
తడవుకొని జాబిల్లికై
తిక్కశంకర దేవుఁడంతట
ముక్కుపై వేలుంచెరా!—"

అని పాడుకొనుచు నుజ్జయినీ నగరవీథులవెంట నొక పిచ్చివాఁడు బయలుదేఱినాఁడు. ఆతనివెంట — నోహో! తండోపతండములుగా నగరములోని బాలురు, వృద్ధులు, స్త్రీలు విరగఁబడిరి. ఆతనితో నవ్వుచు, వెక్కిరించుచు, వేళాకోళములు చేయుచు బాల బాలికలు కేరింతలు గొట్టుచుండిరి. వృద్ధులు పాపమెవరో పెద్ద యింటివాఁడు. చదువుకొన్నవాఁడు, భరింపలేని యేదెబ్బలో తగిలి మతి పోఁగొట్టుకొన్నాఁడు. ఏమున్న

దండీ — సాగిపోయినంతవఱకే సంసారములో సుఖము. విఘాతము వచ్చెనా, యింతే గతి'. అని జాలిపడసాగిరి. చంకలలోని బిడ్డలతోపాటు తమకును కుతూహలము రెట్టింపగా స్త్రీలు అరుగులు, మేడలు, మిద్దెలు నెక్కి చూడసాగిరి. ఇంతేవరికిఁ బిచ్చి. విరగఁబడి యొక వెఱ్ఱివానిని జూచుచున్న నగరజనమునకా! పరుగులెత్తుచున్న యీ వింత మానిసికా? మతిపోయి మాటాడు వానిని జూచినంతనే మనుజులకు మనుజులకు మధ్యనున్న సానుభూతి గాఁబోలు — తక్కిన వారికిని గొంత మతి పోవక తప్పదు. లేకున్న నింతమంది పనులు మాని వెఱ్ఱివాని వికారచేష్టలు చూచి తాముసు గొన్ని వికారముల కేల పాల్పడుదురు? వెఱ్ఱికిని స్వస్థతకును బెత్తెఁడే వార యుండునుగాఁబోలు —

చుట్టును మూఁగుచున్న జనమును జూచిన కొలఁదిని నున్మత్తుని వికారము మఱింత పరమావధిని ముట్టెను. ఎవరికోయీ వెఱ్ఱి? మీకా నాకా? ఉజ్జయినీ పుర వీథులలో నెంతమంది వెఱ్ఱివారో? నగరములో నింత మంది పిచ్చివా రున్నారని యెన్నఁడును వినలేదురా బాబు! లేకున్న రాక నేపోదును. నిక్షేపమువంటి వానికి నిముసములోఁ బిచ్చి యెత్తించిరి. నన్నుఁ జూచిన మీకు

వెట్టి. మిమ్ముఁజూచిన నాకు వెట్టి. బాగున్నదయ్యా. బాగున్నది. చిన్నప్పుడు చదివిన పాణినీయములోని యన్యోన్యాశ్రయదోషము ఋట్టను బట్టి విడుచుటలేదు. మాగురువుగారొక ఉక్కుమానిసి. 'మణుఁగు గ్రుద్దులు తినకున్న పాణినీయము రాదు. పాణినీయము రాకున్న ప్రతివాదిని గద్దింపలేవని' ప్రత్యక్షముగాఁ బాఠము చెప్పి విడిచినారు. వ్యాకరణ మప్పుడే తుడిచివేసినాను గాని మణుఁగుగ్రుద్దులు మాత్రము మానలేదు. అబ్బ! కుడి ప్రక్కలో కెలుకుమనుచున్నది. అబ్బే నామతి మండి పోయినట్లే యున్నది. ఎడమకాలి చిప్పలో — ఖరాలు మన్నది. పాండిత్యము సిగఁగోసిరి. కవిత్వములోఁ గిట్టు బాటున్నదని ప్రయత్నించుచున్నాను. ఆలోచించి వ్రాసిన అయినట్లే — ఆశుకవిత్వమే మనకుఁ గొట్టిన పిండి. శిష్యసత్తమా, ఆశువు వచ్చుచున్నది. వ్రాసి కొనుము.

"మొనగాఁడు రాహువై
మనరాజు మ్రింగఁగా
కాలాంతకుఁడు వచ్చి
త్రొక్కింప లేఁడా?

ఐరావతముఁ దెచ్చి
కైలాసమునఁ బెట్టి
కరితోడ గిరికూడ
కదలిపోయెనురా ! ”

బాలకులు ! మిమ్ములను జూచిన చెడుగుడు నాడ వలెనని యున్నది. ‘బల్ చెడుగుడు గుడుగుడు’ అహ్హా అహ్హా ! అట్లు పాఱిపోవుచున్నా రెందుకు ? పెద్దవానితో నాట లాడుటకు సందేహించుచున్నారా ? మనకిప్పుడు పెద్దతనములోఁ జిన్నతనము. అనఁగా బుధునిలో శని యన్నమాట. ఈ శని దాఁటిన మీఁదట మహారాజ యోగమే. మీరు తరుము గుక్క వేసిన సరే. లేకున్న నేను వేయుదును. తన్నుఁ దగిలిన నాటలో నరఁటిపండు. దెబ్బతగులకుండ నాటలో రస మేమిటి మీ మొగము ! కనుక నే దెబ్బలాట యని శాస్త్రజ్ఞులు వ్రాసినిరి. దెబ్బలు ఆటలు ఏమి, సంధి విడిపోయినదా ? ఇఁక రండు. మన వ్యాకరణ పాండిత్యమువలె నే రాజనీతిలోఁ గూడ సంధికిఁ బోఁగా విగ్రహ మెదురువచ్చుచున్నది. అసలు రాజనీతి యన్న మాటేమిటి నా మొగము. రాజకీయ ములలో నీతి — ఎండమావులలో నీరు — సరికి సరిగా నుండును.

ఆఁ ఆఁగు మాఁగుము. బ్రహ్మబంధూ! వచ్చితివా? నీకోసమే నగరమంతయు గాలించి వెదకుచున్నాను. ఇంత కాల మెక్కడ మణఁగిపోయితివి. ఆఁగు మాఁగుము తెరువరీ! ఆయాసఖేదము నపనయింపుము. ఆ ఉండ్రాళ్ళ బుట్ట యిటు దెమ్ము. ఎక్కడనో స్వస్తివాయనము సంపాదించి వట్టున్నావు — ముఖమున విభూతి రేఖలు. మెడలో రుద్రాక్షలు. మొలను నీర్కావి దోవతి. తమ్ముఁడూ, నిజముచెప్పుము. ఇది విఘ్నేశ్వరుని మీఁద బత్తియా? ఉండ్రాళ్ళమీఁద భక్తియా? ఏమి అట్లు సన్నసన్నగా జాఱుచున్నావు. యమపాశమునైనఁ దప్పించుకొని పోగల్గుదువేమో గాని మనచూపును దప్పించుకొని పోలేవు. మర్యాదగా, మాధుర్యముగ నా యుండ్రాళ్ళబుట్ట నాచేతఁ బెట్టుము. ఉండ్రాళ్ళు తీసికొని బుట్ట నీ కిచ్చెదను. కాదంటివా...ఉండ్రాళ్ళతోఁ గూడ నీబుట్ట యెగిరిపోవును." అని చెప్పుచు వెఱ్ఱివాఁడు జనములో నొక మూల నిలిచిన బ్రాహ్మణుని చేతిలోని యుండ్రాళ్ళ బుట్ట నెత్తికొని వీథి మలుపులో నున్న శివాలయములోనికిఁ బాఱిపోయెను. ఆ బ్రాహ్మణుఁడు తెల్లబోయి యాతనివెంట మహాకాల శివాలయములోనికిఁ బరువెత్తెను. ఆ యాలయ ముజ్జయినిలోని పరమప్రాచీన

మైన దేవాలయము. దానినిండ శిల్పభూయిష్ఠములైన శిలామండపములు, విశాలములైన తిరుచుట్టుమాళిగలు, బలిసియున్నవి. నలువైపుల నాకాశమును బుక్కిలించు సమున్నత గోపురములు తీర్చిదిద్దఁబడినవి. ఆగుడిలోఁ బట్టపగలు మొగము మొత్తి దాఁగుకొనవచ్చును. వెనుక వైపు గోపురముల క్రింది యంతస్తులలో నూదులు విడఁదీయలేనంత చిక్కని చీఁకటి —

ఆ యమాయిక బ్రాహ్మణుఁడు తిన్నగా నాలయము లోనికిఁబోయి పిచ్చివానిని వెదుక నారంభించెను. ముందు గోపురములు చూచెను. శిలా మంటపములు గాలించెను. విసివివేసారి సూటిగా శివలింగమువద్దకుఁ బోయి యాప్రక్క కుడ్యముచెంత తన బుట్టవంటిదే యొక బుట్టను గనుఁగొని 'ఏమిమహాదేవా, నా యుంఛ్రా ళులే నీకును గావలసివచ్చెనా? పిచ్చివాఁడీయఁగా నీ దొంగసొత్తు నెట్లు గ్రహించితివయ్యా' అని బుట్ట తీయఁ బోయెను. అది యా గోడమీఁది దేవతావిగ్రహమునకు నివేదించఁబడినట్లు చిత్రింపఁబడిన యొక బొమ్మ. బ్రాహ్మణుఁడు తడవితడవి విస్తుపోయి 'నాప్రాణమున కీ శిల్పి యొకఁడు. ఎంత యచ్చముగ, నమ్మకముగ నీ బుట్టను ం చినాఁడు! నిజమే యనుకొని పెనగులాడుచున్నాను.

ఉండు. నీ బులుపు వదలెచ్చెదనని చేతిలోని జలకలశమువంచి నీరుచిమ్మెను. రంగులు మఱింత మెఱుఁగెక్కి కాన్పించుచున్నవి. ఔరా, నీరంగులు మాసిపోను. కడిగినకొలఁది పదునెక్కుచున్నవి. అని చీదరించుకొని వెఱ్ఱివానిని వెదకుటకు వీథిలోనికి వచ్చెను. ఒకజైనసన్యాసి యెదురయ్యెను. బ్రాహ్మణుఁడు మొగమింత చేసికొని నీవైన వచ్చితివి రక్షించితివి. చూచితివా పిచ్చివాఁడేమి చేసెనో— ఉదయముననే యొక ధనికునింటికిఁ బోయి విఘ్నేశ్వర పూజ చేయించి నాలు గుండ్రాళ్ళు తెచ్చుకొన్నాను. శనిగానివలెనే పిచ్చివాఁడు దాఁపురించి బుట్టను గాఁజేసి ఎచట దాఁగినాఁడో కనఁబడఁడు. నీవెక్కడనైనఁ జూచితివా' యని కన్నీరు పర్యంత మగుచు నడిగెను. శ్రవణకుఁడా బాపని నోదార్చి 'వెఱ్ఱివాఁడా, దిగులుపడకుము. వెనుకవైపు గోపురములో నుండును. పద చూత' మని వానితోఁగూడ పశ్చిమగోపురము వద్దకుఁ బోయెను. అచట నొక స్తంభమువద్ద ద్వారపాలకవిగ్రహము ప్రక్క నున్మత్తుఁడు నక్కి కూర్చుండియిటునటు చూచుచుండెను. శ్రవణకుఁడు చట్టున వానిని సమీపించి 'బుట్టనిచ్చెదవా ? శపింపుమందువా' యని బెదరించెను. పిచ్చివాఁడు భయము నటించుచు 'ఆఁ శపించకయ్యా — యిచ్చివేసెదను.

సాక్షియున్నఁగాని యెవరిసొత్తు వారికిచ్చుటకు న్యాయ శాస్త్ర మంగీకరింపదు. ఇదిగో బుట్ట—తీసికొనుమని చెప్పుచు గోపురపుఁ జీకటిలోనికిఁ బాఱిపోయెను. ఇద్దఱును వానివెంటఁ బడిరి. వెఱ్ఱివాఁడు స్తిమితముగ నొక ఱాతి దిమ్మపైఁ గూరుచుండి బ్రాహ్మణునితో నిట్లనెను.

" వసంతకా, ఇఁకఁ గూర్చుండుము. చుట్టుప్రక్కల నిర్మానుష్యముగ నున్నది కద — రుమణ్వంతా, కొంచెము నేఁడు దేఁటి విశేషములు చెప్పుమని శ్రవణకుని గోరెను.

రుమణ్వంతుఁడు నిట్టూర్చి యిట్లు ప్రారంభించెను.

"సన్యాసులకును బ్రాహ్మణవిద్వాంసులకును యౌగంధ యునికోటలో సుఖప్రవేశమే కదా! ప్రభాతముననే శిప్రానదిలో స్నానము ముగించుకొని భిక్షాపాత్రముతో కోటలోనికిఁ బ్రవేశించినాను. అంతఃపురములో భిక్ష పుచ్చుకొని యెవరును జూడకుండఁ బాదలమాటున రాజ కుమారిసౌధము ప్రక్కనుండి నడచి మనోరమాభవనము పాణిద్వారముఁ జొచ్చి లోనికిఁ బోయినాను. ఆసమయమున నుదయనప్రభువు స్నానముచేసి దేవపూజకుఁ గూర్చుండునని నాకుఁ దెలియును. అప్పుడు పరిజన మెవ్వరును పిలిచినవారి చెంత నుండక దూరముగా నుం

దురు. ప్రభువువారు క్షిప్తముగా దేవపూజ ముగించు కొని తలయెత్తుసరికి నేను కంటఁబడినాను. వారు చిఱు నవ్వుతో మన కుశలము నడిగి 'నావలన మీకందఱికిని దఱుఁగని శ్రమయును, మనః క్లేశమును గలుగుచున్నవి గదా! యని యెంతో వగచినారు." అనఁగనే మహా మంత్రి కంఠము రుద్ధమై నెమ్మదిగ నిట్లనెను. తా మంత దుర్దశలో నుండియును మనః క్లేశమునకు వగచినారా? ఆ భృత్యానురాగమును దయాంతఃకరణమును వారికే చెల్లి నవి. మనమాట కేమిగాని ... అంతటి ప్రభువెంతటి దశకుఁ బాల్పడెను! మంగళధ్వనులతోఁ బుణ్యాహవా చనముతో వైభవోపేతముగ దేవతారాధనమును గా వించు మహాప్రభువు సాధారణ మానవునివలె నాలుగు పూవులు మహాదేవునితలపై నుంచి పూజయైన దనిపించి నారా? యేమి విపరీతకాలము వచ్చినది! కానిమ్ము. ఇంకెంత కాల మీ భరతసింహమును మనోరమా గుహలో బంధించి యుంచెదరో చూచెదను. పగళ్ళను రాత్రులను బండరాలవలె నతికష్టముమీఁద దొరలిం చుచుఁ గన్నుమూయక యనుకూల క్షణమునకై వేచి యున్నాను. వసంతకా! రేపు నీవు వైదిక బ్రాహ్మణ

బృందముతో రాజభవనమునకు స్వస్తివాచనమునకుఁ బోయినపుడదనుజూచి యేలికతో నిట్లు చెప్పెను.

మన సన్నాహములన్నియుఁ బూర్తియైనవి. రేపు నడికిరేయి ప్రయాణము. సిద్ధముగా నుండుఁడు. ప్రద్యోతనరాజు పట్టపుగజము నళగిరికి వెఱ్ఱియెత్తించు సర్వసన్నాహములు చేసినాము. ఆ మదపుటేనుఁగు స్నానము చేయు రేవులందును, కబళముగొను చోటులందును మంత్రౌషధప్రయోగము లన్నియు నెఱవేర్చితిమి. గాలివాలున ధూపములు వేయునేర్పాట్లు చేసినాము. వీనితో నళగిరికిఁ బిచ్చియెత్తుట కేమియు నభ్యంతరము లేదు. అంతేకాక యావెఱ్ఱిలోఁ గోపమెత్తించుటకు మత్తగజముల మదపంకము నెదురుగా నుంచెదము. సంజ్ఞగా ముందొక్క శంఖము మ్రోగును. వెంటనే సమీపమున నున్న పూరియింటి నంటింతురు. ఆమంటలకు వణఁకును భయమును బుట్టి నళగిరి కట్లు త్రెంచుకొని పట్టఁబగ్గములు లేకుండఁ బరువులెత్తును. అనుపదముననే శివాలయమున వేయి శంఖము లొక్కపెట్టున మ్రోఁగును. దానితో మన గూఢసైనికు లందఱును దమతమ స్థానమున నప్రమత్తులై నిలిచియుందురు.

నళగిరిని బట్టిబంధించు మొనగాఁ డెవ్వఁడును నీ యాజ్ఞ

యినిలో లేఁడని ప్రభువునకు విశదమేకద! గతిలేక ప్రద్యోతుఁడు దిగివచ్చి గజమును బట్టవలసినదని ప్రార్థించును. వెంటనే ఘోషవతిని దీసికొని యొక్క-సారి సారించి ప్రభువులు నళగిరిని బట్టఁగలరు. పట్టుటయే తడవుగ దాని నధిష్ఠించి వాయువేగ మనోవేగాలతో వింధ్యాటవి దాఁటి తెల్లవాఱకుండ కౌశాంబీ దర్శనము చేయుట తథ్యము. పగవా రేనుఁగుతో వంచించినారు గదా! దానికి ఏనుఁగుతోనే ప్రతీకారము జరిగినపుడు నాకు మనశ్శాంతి.” అని మహామంత్రి యనఁగా వసంతకమంత్రి చిఱునవ్వు నవ్వి యూరకుండెను. ‘ఏమి వసంతకా, నీ కంగీకారముగ లేదా — దరహాసము చేయుచున్నావు.’ అనఁగా వసంతకుఁడు నిరుత్సాహముగ నిట్లనెను.

“మీ యసాధారణ స్వామిభక్తిని, ప్రచండరాజనీతిని జూచి యెంత నివ్వెఱ పడుచున్నానో యంతగా మన ప్రభువువారి యన్యవ్యాసంగము చూచి నిశ్చేష్టుఁడ నగుచున్నాను. మీ పడు నీశ్రమ యంతయూ వ్యర్థము గదా యని విచారింతును. యౌగంధరాయణుఁడు చకితుఁడై ‘ఏమది? వింతగా మాటలాడుచున్నావు? విస్పష్టముగఁ జెప్పు’ మనఁగా వసంతకుఁ డిట్లనెను.

"ఇచటినుండి వెడలిపోవుటకు మనమెంత యాత్రమును జెందుచున్నామో యుదయనప్రభువువా రంతగా నీ యుజ్జయినీ పురమును విడుచుటకు దిగులుపడుచున్నారు."

ఏమీ, చెఱను విడచి స్వేచ్ఛనందుట కంత బాధ పడుదురా ? బంగారు సంకెల లంత తీయఁగా నున్నవా ? ప్రభువులకు"

"బంగారు సంకెలలు కావండీ —— వాసవదత్తాదేవి ప్రణయ మాధుర్యము. అవి సంగీతములు గావు. రాగోపాసనములుగావు. చమత్కార సంభాషణములు గావు. ఆమె 'యీసంగతి నాకుఁ బలుకుటలేదండీ' యని వీణెను గ్రిందఁబెట్టును. వారు వీణనందుకొని యామె యంగుళులలోనే యాస్వరములు పలికించి చూపుదురు. ఆమె వెనువెంటఁ దనవల్లకిని మీటుట మాని వట్టి గాలిలో వ్రేళ్ళుకదుపుచు వారి ముఖమును జూచి తన్మయ మగుచుండును. ఇది వరుస —— వేయేల ... ఆమెయే యొక వీణ. వా రొక నిశ్చల రాగోపాసకులు. దీని వెనుకఁగూడ ప్రద్యోత భరతామాత్యుల యొక యెత్తుగడ యున్నదని వింటిని. ఉదయనప్రభువునకు వినఁబడునట్లు వీణపై వికృతధ్వనులు పలికించి ... ప్రభువువారి వీణా

ప్రవణత నూఁతగాఁగొని ఘోషవతిని ముందుఁబెట్టి యీ వీణాచార్యకము నొప్పించిరఁట. — ఇందువలనఁ జిరకాల ముదయనప్రభువును దమచెంత బంధించి యుంచవచ్చును. వీణాస్నేహామూలమునఁ గ్రమముగా నిజహృదయ విద్య నుగూడ సంగ్రహింపవచ్చును. శత్రువు లింతటి కుతంత్రములు పన్నుచుండఁగా మన ప్రభువులు వీణావాదనములో రసాస్వాదనములో నిమగ్నులై యున్నారు. పైగా 'ప్రద్యోతనునకుఁ దగినశాస్తి చేయకుండ నూరక కౌశాంబికిఁ బోవుటలోఁ బౌరుషమేమున్నది ?' అని యనుచున్నారు. ఈమాటలువిని యౌగంధరాయణ మహామంత్రి ముఖము చిట్లించుకొని "ఔరా, యెంత పరువుమాలినపని. ఒకవంకఁ గారాగారమా ? వేఱొక వంక ప్రేమ కలాపమా ? ఆ కళావ్యసని ప్రేమారాధనమున కింతకంటె మంచిచోటు దొరకలేదా ? ఏమీ సృష్టివైచిత్ర్యము ! ఈ వికృత వేషములతోనే మన బ్రతుకులు పండిపోవలయును గాఁబోలు — అట్లే కానిండు. స్వామిని విడచి కౌశాంబీ భవనములలో సుఖముల నాస్వాదించుటకంటె వత్సరాజ్య గౌరవమునకై నన్ను నమ్మిన ప్రజల సేవకై యీ జీవితము నిట్లే ధారపోసె

దను.' అని పలికి ముఖము త్రిప్పుకొనెను. రుమణ్వంతుం డించుక యాలోచించి యిట్లు పల్కెను.

మహామంత్రీ, ప్రభువువారి మాటయే చెల్లింతము. వారు కోరినది ప్రతీకారముగదా! రాణివాసమునుండి రాజపుత్రికనుగూడఁ గదలించి మన ప్రాగల్భ్యము చూపింతము."

మహామంత్రి దిగ్గునలేచి 'మేలితరమైన మాట — అపుడే ప్రద్యోతనుని పన్నగడకు మనది పైచేయియై తగిన శాస్తి చేసినట్లగును. మంచిది. రాజకన్యతోఁ గూడ రాజేంద్రునిఁ దరలింపకున్న నేను యౌగంధరాయణుఁడనే గాదు. ఇఁక లెండు. సంధ్యాకాల మగుచున్నట్లున్నది. దైవదర్శనపరులు దేవాలయములోనికి వచ్చుచున్నట్లున్నారు. ఒకొక్కరుగా నీ గోపురము నుండి బయటకుఁబోవుదము."

అప్పారే! బుఱ్ఱునఁ జిలుక పంజరమునుండి యెగిరి పోవుచుండఁగా నింతమందియుఁ జూచుచునూరకొన్నారా? ఈప్రజల కింత నిర్లక్ష్యమేమి? చాలులెండు. పంజరమా! విచారింపకమ్మా విచారింపకు. నీ చిలుకను నీకుఁదెచ్చి యిచ్చిన సరికద — ఇదేమి యన్యాయ్యమయ్యా, నన్ను గొట్టుచున్నారు. చిలుకనోరఁ జెత్తుకొని పోఁగా దెబ్బలం

నాకా... ఊఁ ... జాగ్రత్త! నాజోలికి వచ్చినఁ జంపి వేసెదను. పూర్వజన్మలో మనది పరశురామావతారమని జ్ఞాపకము. అన్నట్లు నా గండ్రగొడ్డలి యేమైనదో — వెదకుకొనివచ్చెదను." అని పిచ్చివాఁడు దక్షిణపు గోపురమునుండి పరువెత్తుకొనిపోయెను.

---

# పలాయనము

"ఓహో, ఉజ్జయినీ రాజభటులారా, కత్తులు దూసి మీమీ స్థానముల నప్రమత్తులై యుండి నగరద్వారములఁ గాపాడుచుండుఁడని మహారాజాజ్ఞ —

రాజద్రోహము జరిగినది. శత్రుసన్నాహములు ఫలిం చినవి. ఇంతకాలము నామహారాజు నుప్పును బులుసును దిన్నందులకుఁ బిఱికికండ లేకుండ స్వామి ఋణముఁ దీర్పుఁడు." అనుచు నొక రాజభటుఁడు కలవరముగఁ బరుగెత్తుకొని వచ్చి రాజుగారి యశ్వశాల వద్ద నిలిచి యశ్వరక్షకుని బిలువసాగెను.

"పుష్పదంతా ... పుష్పదంతా"

"..................."

"ఏమి! రాజభృత్యుల నిర్లక్ష్యము. నేఁటి వఱకు సుఖముగఁ దిని కూర్చుండి ప్రాణావసరము వచ్చినపు డొకఁడును బలుకఁడు.

ఓహో పుష్పదంతా! తప్పఁద్రాగి యీమూల దొరలుచున్నావా? ఇచట నిన్నుంచినది రాజసేవ కొఱకా? మధుసేవకొఱకా?"

గుఱ్ఱపుసాలమూలనుండి యశ్వరక్షకుఁడు తూలుచు

జోగుచు వచ్చి 'ఎవరయ్యా, చెవిఁగోసిన మేఁకవలె నఱచుచున్నారు ? ఏమంత కొంపమునిఁగి పోయినది ? అర్ధరాత్రివేళ నమాంతముగ వచ్చిపడినావు. త్రాఁగుడఁట ... త్రాగుడు ! ఈమొనగాఁడు ఆక్షేపించ వచ్చినాఁడండీ మీరాజుగారు త్రాగుటకుఁగూడ సరిపోవునంత జీత మిచ్చుచున్నారా ? ఏదో నాతంటాలు నేను పడుచున్నాను గాని......ఇల్లాలి పుస్తెలును పూసలును గల్లుకుండలకే నైవేద్యము పెట్టినాను. ఇంతేనా ... చూచుకొనుము. గుఱ్ఱపుసాలయంతయు ఖాళీ. ఒక్కొక్క గుఱ్ఱమునే తాకట్టుపెట్టి త్రాగివేసినాను. ఎవరయ్యా, త్రాగనిది ! చుక్క వేసికొనకుండ సూర్యుఁడు పొడుపుకొండ లెక్కుచున్నాఁడా ? — సరకులేకుండ చంద్రుఁడు రేయియంతయు నాకాశమునఁ గొలువుతీఱుచున్నాఁడా ! అంతవఱకు నెందుకు — ఈరాత్రి తప్పఁద్రాగి యొల్లు మత్తుతోఁ దూలుచున్నదో చూడు. లేకున్న నీరేయి యందఱికి నింత మొద్దు నిద్రలేమి ? చూచుచుండగనే తూర్పుసంద్రమంతయు సురాభాండేశ్వర మయిపోయి నట్లున్నది. నిజము చెప్పు. నీవు త్రాఁగకుండఁగనే కత్తి బట్టుకొని పరుగులెత్తుచున్నావా ?'' ఈ ప్రలాపము విని రాజభటుఁడు మండిపడి "ఇట్లు నోటికి వచ్చినట్లు వాగిన

నీకు గొఱడా దెబ్బలు తప్పవు. దానితో మ త్తంతయు విఱిగి చక్కఁబడుదువు. లెమ్ము. చప్పున జయమంగళా శ్వమును సిద్ధముచేసి తీసికొనిరమ్ము. సాలంకాయనులు రాజభవనము వద్ద వేచియున్నారు." అని తొందర పెట్టెను. గుఱ్ఱపువాఁడు చెక్కుచెదరకుండఁ జూచుచు "అరే — జయమంగళమును గూడ నిన్న రాత్రియే యమ్మి వేసినాను. దానితో నీ గుఱ్ఱపుశాలయంతయు బోసినోటివలె శూన్యమై పోయినది. మఱి ముందు చెప్పలేకపోయినావా ? దానినైన నట్టిపెట్టి యుందును" అని హీ హీ హీ యని నవ్వెను. భటుఁ డుగ్రుఁడై రాజుగారి యుత్తమాశ్వము నమ్మివేయుటకు నీకెన్ని గుండెలున్నవి ? కానిమ్ము. మంత్రిగారితోఁ జెప్పి ముందు నీపని పట్టించెదను." అని తిరిగి పోవుచుండఁగా నశ్వరక్షకుఁడు "మాబోటివారిపై నంత యాగ్రహామే మిటయ్యా, ఉండుండు. గుఱ్ఱమునకుఁ గళ్ళెము పల్లము దగిలించి తెచ్చెదను. ఊరక నీతోఁ బరియాచకమునకై యట్లంటిని" అనెను.

భటుఁడు విసిగికొనుచు "ఆవల నగరమున మహోప ద్రవము జరుగుచుండఁగా నీకుఁ బరియాచకములా ?" అని యదలించెను.

"అంత యుపద్రవమేమి జరిగినది"

నీమత్తు మాసిపోను. నీవు వినలేదా ? మన పట్టపు ఏనుఁగు నళగిరికిఁ బిచ్చియెత్తినది. మావటీండ్ర యంకుశములు కొఱగాక పోయినవి. గజపాలకుల యుపాయములన్నియు బూడిదపాలైనవి. ఏనుఁగు ఘీంకరించుచు నగరవీథుల వెంటఁ బరుగులెత్తసాగినది. మహారాజుగారి కేమియుఁ బాలుపోలేదు. చిట్టచివరకు వత్సరాజుగారి నేనుఁగు నెట్లైన స్వాధీనము చేసికొనవలసినదని కోరిరి. వత్సప్రభువు మహోత్సాహముతో ఘోషవతిని దీసి గజమున కెదురుగాఁబోయి యొక చిత్రముగా వాయింపఁ దొడఁగిరి.

ఎంతవింత యనుకొన్నావు! తొండము నెత్తుకొని గర్జించుచుఁ ద్రొక్కివేయుటకు మీఁదకు వచ్చుచున్న యంత పొగరుఁబోతు ఏనుఁగును నాగస్వరమునకుఁ బడగ నాడించు కోడెత్రాఁచువలె నావీణపాటకుఁ దొండము నాడించుచు వారివద్దకు వచ్చి తొండమువంచి చెంత నిలిచిపోయినది. నిలిచినదే తడవుగా నుదయన ప్రభువు వీణతోఁగూడఁ జరచర తొండమునుండి యా మదగజముపై నెక్కి కూర్చుండి వెంటనే దానిని మనోరమా భవనమువద్దకు నడిపించెను. ఆ సౌధము పైయంతస్తు

నంతఃపురములో, ఆయుధాగారముల — నశ్వగజశాల లలో గూడ గూఢచారులే. చివరకు చెట్టుకొమ్మలలో నాకుకదలిన కౌశాంబీ చారుఁడేమో యన్నంత యనుమానము పాదుకొనిపోయెను. ఆఱునెలలు నగరములో సన్నాహములు జరుగుచున్నను ఆవంతయేని ప్రద్యోత రాజమంత్రులకు సూచన పట్టువడకుండ నా గండర గండఁడు నిర్వహించెను. అక్కడ సంకులయుద్ధ మెట్లు పరిణమించెనో త్వరగాఁ బోయి చూడవలెను.'' అను తలపోయుచు నాభటుఁడు విసవిసనడచి యుద్ధప్రదేశమునకుఁ బోయెను.

చిమ్మ చీఁకటి — దానికిఁదోడు ఆకాశమునుండి భూమి వఱకు నల్లని తెరవలె ధూళి లేచిపోయెను స్వపక్షమువా రెవరో, ప్రతిపక్షము వారెవరో తెలిసికొనుట యుజ్జయినీ రాజసైనికులకు దుర్ఘటముగా నుండెను. సకిలింపులచే గుఱ్ఱములన్నియు, ఘంటాధ్వనులచే నేనుఁగులన్నియుఁ దెలిసికొని తప్పించుకొని సైనికులు ముందుల నురుకుచున్నారు. తళతళలాడు కత్తులు విసరి, శత్రుసైనికులను గొట్టఁగా వారి యిత్తడి డాళులకుఁ గత్తి కొసలు తగిలి లేచిన నిప్పురవ్వలు మేఘములలోని మెఱపులవలె నాచిమ్మచీఁకటిని ఒక్కత్రుటి వెలిగించుచుండెను.

శత్రువు తరుముకొని రాఁగాఁ బ్రాణముల తీపిచేఁ బరుగెత్తిన రెండవసైనికుఁడు కొండవలెఁ జచ్చిపడియున్న యేనుఁగు కళేబరముప్రక్క దాఁగికొనుచున్నాఁడు. కొంతసేపటికిఁ గ్రింద మడుగులుగట్టిన రక్తప్రవాహము పైకి లేచిన ధూళితెరను జీల్చివేయఁగా సగము తెరముక్క పైని వ్రేలాడుచున్నట్లు పైధూళి పైనే తిరుగుచున్నది.

క్రమముగా యుద్ధముచ్చస్థితి నందుకొనెను బారుటీలల పరిభ్రమణములు, నల్లని చీఁకటి పొరలలో తెల్లని యేనుఁగు దంతముల తళతళలు చెట్లపండ్లవలె దుల్లిపడుచున్న వీరులతలలనుండి జారిన జరీపాగాల మిలమిలలును గన్నులను మిఱుమిట్లు గొల్పుచు రణరంగమున నిండిపోయెను.

యౌగంధరాయణమహామంత్రి యెనలేని యుత్సాహముతోఁ దనసైన్యమును నడపుచుండెను. వసంత రుమణ్వంతులు వత్సప్రభువును దఱుము యోధుల నెదిరించి చాలవఱకు నిలువరించిరి. సార్థకనాముఁడైన మహాసేనరాజు సైన్యము లింకను సముద్ర తరంగములవలె మీఁద వచ్చిపడుచున్నవి. వత్సరాజ సైన్యములా — పరిమితములు — వచ్చిన యోధులతో నెల్ల యుద్ధము చేయుచుఁగూరుచున్నచో వత్సప్రభువునకు వెనుకరక్ష

ణము లేకుండఁబోవును. కనుక తమప్రభువును వెన్నాడుచుఁ బోవలెనని మహామంత్రి యాజ్ఞాపింపఁగా మనసొప్ప కున్నను ఉపమంత్రులు వసంత రుమణ్వంతులు రెండు జవనాశ్వముల నెక్కి కౌశాంబీ మార్గమునఁ బోయిరి. ఇఁక నసహాయ శూరుఁడైన మహామంత్రి యొకఁడును హతశేషులైన సైనికులను బురికొల్పుచుఁ బ్రచండ ముగాఁ బోరు సలుపుచుండెను. ఆబ్రాహ్మణుని కంత శౌర్యస్ఫూర్తి, బాహుబలము నెచ్చటినుండి వచ్చినవో యనుకొనుచు నుజ్జయినీ క్షత్రియవీరులు సైతము నివ్వెఱ పడుచుండిరి. అప్పు డతఁడు కార్తవీర్యార్జునుని సహస్ర భుజాటవిని నఱుక గండ్రగొడ్డలియెత్తి పరుగెత్తు భార్గవ రాముఁడై పోయెను, అరచేతికిఁ గన్ను లున్నట్లు పుంఖానుపుంఖముగ బాణములు చిమ్మి యరివీరులఁ దహ తహ లెత్తించిన ద్రోణాచార్యుఁడై విజృంభించెను, ఎడమచేత బంగరుడాలు కుడిచేత సుదీర్ఘ కరవాలము మెఱయఁగా నెదురుపడ్డ వైరిస్తోమమును ముక్కలుగా నఱకిప్రోగులు పెట్టుచుండెను.

ప్రాగ్దిశ నరుణారుణ రేఖలు పొడసూపినవి, మహా మంత్రి శరీరముగూడఁ దూర్పుదిక్కువలె రక్తరేఖలతో ధగధగలాడెను. ఖడ్గముఁ ద్రిప్పుచు నాతఁ డొక వీరునితో

ద్వంద్వయుద్ధము చేయుచుండెను. భరతామాత్యుఁడు విజయసుందరమను మదమాతంగము నెక్కి వచ్చి యాతని నెదుర్కొనెను. మహామంత్రి యటునుండి యిటు తిరిగి యదరుపాటుగాఁ గత్తినెత్తి విజయసుందర శుండాదండ మును నఱుకఁబోఁగా దైవవైపరీత్యమువలన నాకత్తి వ్రేటేనుఁగు దంతమునకుఁ దగిలి కత్తి జాఱిపోయెను. ఒక్కపెట్టున శత్రుసైనికు లాతనిపైఁ బడి యాతనిని బంధించి నిలువఁబెట్టిరి. నిర్విరామ సంఘర్షణముచే నలసి సొలసిన యా స్వామిభక్తుని శరీరము తూలిపోయెను.

ప్రద్యోత రాజసైన్యమున విజయశంఖధ్వానములు మిన్నుముట్టెను.

మంత్రి యాదేశము ననుసరించి బందిగాఁ బట్టుపడిన యౌగంధరాయణుని నొక ఫలకశయనముపైఁ బరుండఁ బెట్టి రాజభటులు ప్రద్యోతప్రాసాదములవైపు తీసికొని పోయిరి.

---

# చిత్ర వివాహము

ఆరెండు వార్తలును నప్పుడే యవంతీరాజ్యపుఁ బొలిమేరలదాఁకఁ బొక్కి-పోయినవి. పల్లెలనుండి పట్టణముల నుండి ప్రజాప్రవాహము, వఱదరోజులలోని శిప్రానదివలె నుజ్జయినీనగర రాజవీధులఁ బ్రవహింపఁ దొడఁగెను. ఔరా, ఏమిజనము ! ఇసుకవేసిన రాలకుండ నున్నది. ఒకరిమాట నొకరువినరు. తాము విన్నవార్తలకుఁ జిలువలు పలవలు దొడిగి యొవరికివారే చెప్పుకొని పోవుచుండిరి. మొత్తముమీఁద నొకటేపాట. 'వత్సరాజులుంగారు వాసవదత్తమ్మను హరించుకొని పోయి' రన్నది యాపాటకుఁ బల్లవికాఁగా యౌగంధరాయణ మహామంత్రి యుద్ధమునఁ బట్టుపడినారఁట' యని దాని కనుపల్లవి.

రణరంగమునుండి రాజప్రసాదములకుఁ బోవు ఘంటాపథమున సౌధాగ్రములందే కాక చెట్లకొనలందును జనము కూర్చుండి దేనికొఱకో యెగిరి యెగిరి చూచుచుండిరి.

సముద్రమధ్యమున నెత్తైన కెరటమొకటి లేచినట్లు ఉన్నట్టుండి జనములో నొక హొంగు బయలుదేరెను.

రాజభటులు ప్రజలను పార్శ్వములకుఁదొలఁగించి కష్టము మీఁద త్రోవఁ జేసిరి. పైకప్పులేని పల్లకివంటి యొకా నొక వాహనముపై యుద్ధరంగమునఁ జిక్కిన యౌగంధ రాయణుని దీసికొని వచ్చుచున్నారు. త్రొక్కిడి యెక్కు వయ్యెను. రాజోద్యోగులు విసిగికొనుచు 'జనులారా, అంత త్రోసికొని యేమి చూచెదరు. కౌశాంబీ మహా మంత్రి యౌగంధరాయణులు యుద్ధమునఁ జట్టుపడిరి. వారింక రాజబందిగా నిచటనేయుందురుగదా! యెపుడు చూచినను జూడవచ్చును. వారు గాయములతో నస్వ స్థతగా నున్నారు. మఱింతశ్రమ కలిగింపక తొలఁగి పొండు. తొలఁగిపొండు. అని బిగ్గరగాఁ జెప్పఁదొడఁగిరి.

ఈ మాటలు వినఁగా యౌగంధరాయణునకు నవ్వు వచ్చెను. లేవలేక లేవలేక లేచి యొక ప్రక్కకొదిగి కూ ర్చుండి యిట్లనెను. 'వారి నేల తొలఁగింతురు? నన్ను మీరు చినుఁగుగుడ్డలతోఁ బిచ్చివేసముతో మాత్రమే పూర్వ మెఱుఁగుదురు. ఇపుడు నేను చేసినపనికి దిగ్భ్రాం తులై చూచుచున్నారు. చూడనిండు. రక్తసిక్తము లైన యీ గాయములకుఁ గాని యీ నిర్బంధమునకుఁ గాని నేను సిగ్గుపడుటలేదు. సరిగదా గర్వించుచున్నాను. ప్రయత్నించి నాప్రభువు చెఱ విడిపించితిని. దైవదోష

మువలన కత్తి జాటి పగతులకుఁ బట్టువడినాను. ఉద యనప్రభువు సుఖముగ వత్సరాజ్యమును బాలించుచుం డినఁ జాలును. నేను నిర్విచారముగా నీ జీవితశేష మును గారాగారమందే గడపివేయుదును. దేశభక్తుల కును స్వామిభక్తులకును గారాగృహము కల్యాణమండప మనుకొనుఁడు. భార్యాపుత్రులు లేనివానికి సన్యాసము కంటె సుఖ మేమున్నది? చిరకాల మనోరథము సిద్ధిం చినమీఁదట వచ్చిన విపత్తెంత రమణీయముగా నుం డును! తమ ధర్మము నెఱవేర్చిన సంతృప్తి గలవారికి మరణమొక లెక్కలోనిదా? నాకర్తవ్యమును నేను సం పూర్ణముగ నిర్వహించితిని.

నానేర్చుకొలఁది కార్యమును, ఖడ్గమును, నడపినాను. శత్రుల యహంకారమును మిత్రుల యపకీర్తిని ఒక్క సారిగా వదల్చితిని. నా యభీష్టము నెఱవేఱినది. ప్రభువు విజయవంతుఁ డయ్యెను. నా కింకఁ గావలసిన దేమి?

వెఱగుపడుచు నన్ను వీక్షించు నుజ్జయి
నీ పురస్థులార! నిలిచి వినుఁడు —
స్వామిభక్తియెడలఁ బ్రాణమ్ము నిడుదును.
అరసి మంత్రిపదవి నందుకొనుఁడు!

అని యాతఁడు గంభీరముగఁ బలుకుచుండగా నొక రాజభటుఁడు వేగముగ వచ్చి సాధిక్షేపముగా నిట్లనెను.

స్వామీ! తమకొక శుభవార్త తెచ్చినాను. వత్స రాజులుంగారు వింధ్యాటవిలో నుజ్జయిని రాజసై నికులకుఁ బట్టుపడినారఁట.'' అని చెప్పి ప్రక్కకొదుగఁగా మహా మంత్రి నిశ్చలముగ నందుకొని 'ఝంఝామారుతమును మూటఁగట్ట గలిగినపుడు వెడలఁగ్రక్కిన చంద్రుని వెంటనే రాహువు కబళింపఁ గలిగినప్పుడు వత్సవిభుఁడు పగఱకు దొరకెనని చెప్పుము.

భద్రగజముపై గడియకు యోజనముగాఁ గడచిపోవు నుదయనప్రభువునేమి? మఱలఁ బట్టుకొనుట యేమి? ఆతని గజగమన పాండితి నెఱుఁగని వారిదగ్గర నీ మాటలు చెప్పుము. పొమ్ము అని పలికి యథాపూర్వ ముగఁ బల్లకిలో శయనించెను. పల్యంకిక రాజభవనముల వద్దకు వచ్చెను. ఇరువురు భటులు జాగ్రత్తగా నాతని దింపి యాయుధాగారములోనికి నడపించి యొక వేత్రా సనమునఁగూర్చుండ బెట్టిరి. చుట్టును దళతళలాడుచు సానఁబెట్టఁబడిన దీర్ఘఖడ్గములును, నమ్ములపొదులలో నిండుగ నమర్చఁబడిన నిశితనారాచములతోఁ గూడిన పటుతర కార్ముకములును జూపఱులకు భయసంభ్ర

మములు గొల్పుచు గోడలందు వ్రేలాడుచున్నవి. ఒక సారి చుట్టును దరహాసముఖముతోఁ గలయఁజూచి యాధీరుఁడు తనలో నిట్లనుకొనెను. 'వత్సనరపతి తప్పించుకొని పోయినప్పటినుండియు వీరికి జాగరూకత యధికమైనట్లున్నది !

'ఉదయనప్రభు పేరింటి యుగ్రవహ్ని
పట్టి బంధింపఁదలఁచిన ప్రముఖు లపుడె
కను మలపి నిద్రపోవఁగాఁ జనదు — గాని
రత్నముహరింపఁ బెట్టెకు రక్షణమ్మె ?'

ఇంతలో నొక సేవకుఁడు వచ్చి 'భరతామాత్యులు తమ బంధముల విప్పివేయవలసినదని యాజ్ఞాపించినారు; అని చెప్పుచు నెమ్మదిగా నాతని శరీరమునందున్న కట్లను విప్పివేసెను. దానితో భరతామాత్యుఁడు తన్నుఁ జూడ వచ్చుచున్నాఁడని యాతనికి స్ఫురించెను.

రానిమ్ము ... ప్రతిజ్ఞనిర్వహించిన నా నిర్లక్ష్యవచనములు వినుచుఁ దమ తంత్రములు పాఱక నీతి శాస్త్రములలో మార్గముగానక లోలో ఖిన్నుఁడగుచు నావద్ద నిలిచిన యుజ్జయినీప్రధానామాత్యుని జూచుటకుఁ గుతూహలముగానే యున్నది.

కాను, తాను లోహాగజముతో వంచనము చేసి

స్వకార్యము సాధించుకొన్నవాఁడు. నేనా — మాయకుఁ బ్రతిక్రియఁ జేసి నెగ్గించుకొని స్వామి చెఱవదల్చి ఖడ్గముతో నెదిర్చి వీరోచితముగఁ బోరి దైవికముగ వైరులకుఁ జిక్కినవాఁడను. ఈ యంతరమును భావించు నభిమానియైనచో నన్నుఁ జూచుటకు మొగముచెల్లక నిజముగ బాధపడును పాపము!" అని యౌగంధరాయణుఁడు తలపోయుచుండగా నింతలో భరతామాత్యుఁడు వచ్చి సాభిప్రాయముగ "యౌగంధరాయణులకుఁ గుశలమా" యని ప్రశ్నించి 'మీ పేరు వినుటయేగాని యింతవఱకు దర్శన భాగ్య మబ్బలేదు' అని పల్కరించి యెదురుగ నున్న యొక పీఠముపైఁ గూర్చుండెను. యౌగంధరాయణుఁడు మేఘగంభీరమైన కంఠము సవరించి యిట్లనెను.

"ఎంతమాట సెలవిచ్చితిరి! ఇప్పటికైన మిమ్ములను జూడఁ గల్గినందులకు ధన్యుఁడ ననుకొనుచున్నాను. పితృవంచకులను బరిమార్చి యుపశమించిన యశ్వత్థామవలె నిట్లుపడియున్నాను. ఇట్టి యీ క్షతగాత్రుని జూచుట కూడ తమరు భాగ్యమనియే భావించుచున్నారా!"

"మత్తగజ లాలనమిషచే వంచనము నడపిన మీరు స్వోత్కర్షము నంత వంగ్యముగా సెలవీయనక్కఱలేదు"

"ఔను. పాపము! మీరు వంచన మేమెఱుఁగుదురు? మద్దిచెట్ల మల్లెతీవల మాటున కృత్రిమ దంతావళమును బెట్టి మీరు చేసినది వీరసాధారణమైన పని! రాజోపచారార్హుఁడైన యుదయనమహీపతిని కలకుటానేలపైఁ దిగిచి యడవితీఁగలతోఁ గట్టిపడవేయుట యుదారుల సత్ప్రవర్తనము! మత్తగజమును బట్టలేక గజశిక్షకులు గొడ్డువోఁగా 'దేహి' యనిన 'నాస్తి' యనలేక వీణావాదనముతో ద్విరదమును లాలించి ప్రజోపద్రవమును మాన్పుట మాత్రము ఘోరవంచనము! ఎంతవింతగాఁ బలుకుదురండీ — మహాజనులు నడచిన దే త్రోవయన్నట్లు మేమును దమ యడుగుజాడలలోనే నడచి కృతార్థుల మైనాము.

"దాని కేమిగాని — ఆయన సౌశీల్యమును నమ్మి రాజపుత్రికి వీణ నేర్పుఁడని యొప్పగింపఁగా పరులకన్నె నట్లు బలవంతముగా నపహరించుట ధర్మబద్ధమైన పని యేయని సమర్థింతురా?"

ధర్మాధర్మములు మిక్కిలి సూక్ష్మములు. కొన్ని ధర్మములు స్థూలదృష్టికి నధర్మములుగా గానిపించును. వసుదేవపుత్రుఁడు తన్ను వరించిన రుక్మిణీదేవిని బరిగ్రహించి తీసికొనిపోవుట రుక్మిశిశుపాలురకు దురంతకృత్య

ముగాఁ గనఁబడినది; మీరు దూర మాలోచింపలేదు గాని — క్షత్రియులకు గాంధర్వ పరిణయము శాస్త్ర విహితము కాదని మీరుమాత్ర మనఁగలరా? ఇది యక్షరాల గాంధర్వసాక్షికమైన పాణిగ్రహణము. ఘోషవతి వారిరువురికి నమృతరాగబంధముతోఁ బరిణయము చేసిన పిమ్మటనే యుత్తమ భరతవంశ్యుఁడైన యుదయనప్రభువు తన్ను వరించిన రాజకన్యను దనతోఁ దీసికొనిపోయెను.

"తమరు ఖడ్గవిశారదులే గాక కవితాధురంధరుల వలెఁ గూడఁ గనఁబడుచున్నారు."

"ఏదో తమవంటి పెద్దల సాంగత్యదోషముచే నెంత వలదన్నను గొంత కవిత నన్నును బట్టుకొని విడుచుట లేదు."

"మంచిది. రాజనీతిలో నాఱితేఱిన మీకు వేఱే చెప్పఁ బనిలేదు గాని — విజితుఁడైన వానికి మరణ దండనము విహితమై యుండఁగా మామహారాజు చేసిన మన్నన కిదియేనా కృతజ్ఞత?"

తమరు మన్నించవలెను. మాకృతజ్ఞతను మీరు సరిగా గుర్తింపలేదు. ఏమనఁగా — చేతికిఁ జిక్కిన మహాసేనులను సగౌరవముగ విడిచిపుచ్చుట కంటె మే

మేమి కృతజ్ఞత చూపించఁగలము ? మేము కృతఘ్ను లమే యైనచో వత్సప్రభు వుజ్జయిని కోటపై నెగురు పతాకల నన్నిటిని దించివేసి మఱి పోయియుండును. ఇంతకు మన యుభయుల యదృష్టములును మంచివి. కనుకనే మన ప్రాణములును మానమును మనకుదక్కినవి.

"ఏమీ...మహాసేనుల నవమానించి కౌశాంబి మనఁ గలదనియేనా మీ యూహ ?"

మీాయమాయికత్వము నాకు వింత గొలుపుచున్నవి. కన్నులయెదుట నింద్రజాలము చేసి నిర్లక్ష్యముగఁ దప్పించుకొని వత్సప్రభుఁడు పోవునపుడు చూపలేని చాకచక్యమును సుదూరముననున్న కౌశాంబిపై నేమి చూపుదురు లెండు."

ఉభయరాజ్య ప్రధాన మంత్రుల మధ్యమున నిట్టి ప్రజ్ఞావాదములు తీవ్రముగ సాగుచుండగా హఠాత్తుగా రాజాంతఃపుర సౌధమునుండి పెద్ద యలబలము విన వచ్చెను.

భరతమంత్రి చట్టున నొక భటునిబిలిచి రాచనగరిలో నా యలజడి యేమో కనుఁగొని రమ్మనిపంపెను. వాఁడును ద్వరితముగఁ బోయి వచ్చి యిట్లు చెప్పెను.

"దేవరా, మహారాణి యంగారవతీదేవిగారు రాజ

కుమారి వాసవదత్తమ్మగారి యెడఁబాటునకు సహింప లేక కంటికి మంటికి నేకధారగా విలపించుచు 'నల్లారు ముద్దుగాఁ బెరిగిన యొక్క పుత్రికకు మనసుదీఱ మహా వైభవోపేతముగ నింటఁ బెండ్లి చేయనేరమైతిమే' యని ఖేదపడుచు జీవితమును రోసి యెవరును జూడకుండ నంతఃపుర సౌధాగ్రమునుండి దుమికి ప్రాణము విడుచుటకు సిద్ధపడిరఁట —

ఈసంగతి నెట్లో తెలిసికొని మహారాజు చరచర ప్రాసాదాగ్రము నెక్కి దేవేరికిఁ బలువిధముల నచ్చఁ జెప్పి యోదార్చి స్వస్థతకుఁ దెచ్చిరి. ఐనను మహారాణి వారి దుఃఖము పట్టశక్యముగాకుండ నున్నది. ఆమె నెట్లైన సంతోషపఱుపవలెనని మహాసేనప్రభువులు ప్రయత్నించుచున్నారు."

భటుఁ డిట్లు చెప్పగా భరతమంత్రి మనసులో నించుక యాందోళనపడి రాజకుటుంబమునకుఁ దటస్థించిన కష్టస్థితి యెట్లు తొలఁగునా యని యాలోచించుచుండెను. ఇంతలో రాజభవనమునుండి మఱియొక పరిచారకుఁడు పరుగునవచ్చి భరతామాత్యునితో "......ఇట్లు యౌగంధరాయణ మహామంత్రులతో తమమాటలుగఁ ప్రభువులు చెప్పుమని నారు" అని నెమ్మదిగా ననెను.

భరతమంత్రి విస్ఫారిత ముఖముతో "వారే యౌగంధరాయణులు! ఈ ప్రియవార్తను నీవే వారికి విన్నవింపుమనఁగా వాఁడు సవినయముగ నాయనతో నిట్లు మనవిచేసెను. "మహామంత్రీ, మాప్రభువువారు తమతోఁ జెప్పుమనిన మాటలివి —

మిత్రమా, దురదృష్టమున మనకు లేనిపోని విరోధములు తటస్థించినవి. ఇంతవఱకు నొకరి నొక రపార్థము చేసికొని యొకరి నొకరము సాధింపఁ జూచితిమి. ఇఁక మన విరోధముల నన్నింటిని విస్మరించి స్నేహపూర్వకముగా బాంధవ్యము కలుపుకొను శుభసమయము వచ్చినది. మీరు మాకుఁ జేసిన మహోపకార మేమియును లేదు, మీ యచంచల స్వామి సేవాపరాయణతకును. సుగుణ సంవర్తికిని ముగ్ధుఁడ నగుచున్నాను. ఈ సుస్థిర స్నేహభావమునకు సూచకముగ నొక శుభకార్యమును మీ యాధిపత్యమున జరిపింపఁ దలంచుచున్నాను.

వత్సరాజును నేను హింసింపవలె ననికాని రాజ్యలోభముచేఁ గాని బంధింపలేదు. ఆతని సర్వగుణాతిశాయితనుఁ జూచి యట్టివాఁ డల్లుఁ డగుట వాంఛనీయమని పలుమారులు నాలో నే నువ్విళ్ళూరితిని. కాని యాతని

యహంత మాత్రము నన్నుఁ జీకాకుపఱచి యీ కలఁతల నన్నింటిని దెచ్చిపెట్టినది. ఐన దేదో యైనది. కన్ను మూసికొని వేసినను హోమద్రవ్య మగ్నిహోత్రములోనే పడ్డదన్నట్లు మాప్రయత్న మెట్లున్నను నిజముగ వాసవకుమారి యదృష్టవంతురాలు గనుక సజ్జనహస్తమునఁ బడినది. ఇఁక దడయ నేల — పుత్రికాప్రవాసము మూలమున మిక్కిలి దురపిల్లు నంగారవతీదేవికి మనఃప్రీతిగ వాసవకుమారీ వత్సరాజుల చిత్రపటములకు లాంఛనప్రాయముగఁ గల్యాణ మహోత్సవము జరిగింపఁ గుతూహలపడుచున్నాము.

మీరు మాకు బందియైతి నన్న మనఃఖేదము విడిచి యీ నూతన కౌశేయవస్త్రములు ధరించి యీ సువర్ణపాత్రను గ్రహించి యందున్న స్వర్ణాక్షతలతో వధూవరుల నాశీర్వదింపుఁడు. సుముహూర్త మాసన్నమగుచున్నది. తడవుసేయక వెంటనే రావలసినదని మా కోరిక" అని ప్రద్యోతరాజదూత చెప్పగా మహామంత్రి యాశ్చర్యమునకు మేరలేకపోయెను. 'ఔరా, ప్రద్యోతుల యౌదార్యము ! కడుపులో నమృతము దాఁచుకొని పైకి గర్జించు వర్షామేఘమూర్తిని మించిపోయినాఁ డీ మహారాజు ! నేను క్షణముక్రిందటివఱకును రణ

రంగమునఁ గట్టించిన మడుగులింకను నింకిపోలేదు. రాజ కుటుంబములో, మంత్రుల యెడందలలో నేనుబుట్టించిన సంక్షోభము లింకవఱకును జల్లారనే లేదుగదా! ఇట్టితతి నీ శత్రురాజమంత్రికిఁ జేయు నసాధారణ సన్మానము ప్రొద్దుట నా శరీరమునఁ బడ్డ దారుణాఘాతములకంటెను సలపరించుచున్నది.' అని పలుకుచు యౌగంధ రాయణుఁడా పసిఁడిపాత్ర నందుకొనుటకు సంకోచించెను. వెంటనే భరతామాత్యుఁ డందుకొని

"మహామంత్రీ, మీరు సందేహింప నక్కఱలేదు. పూర్వగాథల నన్నింటిని విస్మరించి మీ చెలిమికై చేయి చాచుచున్న మా ప్రభువు కోరికను మన్నింపుడు. అని తొందరచేయఁగా యౌగంధరాయణుఁడు నెమ్మదిగ లేచి మహారాజుపంపిన వస్త్రయుగ్మము ధరించి సువర్ణా క్షత పాత్రనుఁ జేతఁబట్టుకొని రాజభవన చతుశ్శాల లోనికి నడచెను.

చతుశ్శాలా ప్రాంగణ మంతయుఁ జక్కగా నలంక రింపఁబడెను. పచ్చని మామిడాకుతోరణములతో నడుమ నడుమ వ్రేలాడు పూలగుత్తులతో వివాహమండపము కలకలలాడుచుండెను. పునుగుజవ్వాదులతో స్ఫటికమణి కుండికలలోని హిమాంబుపూరములతో నచటి గాలిపొ

రలు ఘుమఘుమలాడెను. ఎదుట నొక యెత్తైన చోట నమర్చిన రెండు మణిసింహాసనములపై జీవకళ లుట్టిపడు చున్న వాసవదత్తా వత్సరాజుల వర్ణచిత్రములు శోభ లొలికించు చుండెను. అగుటకుఁ జిత్రపటములేగాని పర ధ్యానముగఁ జూచిన నచ్చముగ వయోరూపలావణ్య విభ్రాజితులైన యొక రాజదంపతు లచ్చటఁ గూరుచున్నట్లే యుండెను.

ముఖ్యరాజోద్యోగులును, ఆప్తరాజ బంధువులును మాత్రమే యా సదస్సు నలంకరించిరి. కల్యాణవేదికకుఁ బ్రక్కగా సౌధోపరితలమున ముందులకు వచ్చిన గోపు రములందు శ్వేత యాకుపచ్చ వలిపెపుఁదెరలకుఁ జాటున దాసదాసీజనముతో మహారాణి యంగారవతీదేవి యధి వసించెను.

మహామంత్రి సభాభవనమున నడుగుపెట్టులే తడవుగ రాజోద్యోగు లందఱును గౌరవసూచకముగ లేచి స్వాగ తము పల్కి మన్నించిరి. భరతామాత్యుఁడు వెంటరా నాతఁడు వేదిక చెంతకుఁ బోవుచుండగా, ప్రద్యోత మహా రాజెదురువచ్చి చిఱునవ్వుతో గౌరవము నెఱపి తనకు దగ్గరగా నొక యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను.

మహాదాశీర్వచన సమయము వచ్చినది. ప్రద్యోత

మహారాజు చట్టున లేచి "విప్రోత్తమా, మీ యమోఘాశీర్వచనము గానిండని పల్కెను.

మహామంత్రి యానందభరితుఁడై లేచి —

"మహాజనులారా, ఇట్టి వివాహము చరిత్రాత్మకమైనది. సర్వవిధములఁ బ్రతిఘటించి తంత్రావాపములకుఁ బ్రతితంత్రములు పన్ని శత్రుత్వము సాగించిన యొక రాజకుమారుని యహమ్మతిని సహించి యాత్మీయునిగా మన్నించి యాతనికిఁ దమ కన్యారత్నము నిచ్చి యుద్వాహము చేయుట సాధారణ విషయముగాదు. మాయం దింత యౌదార్యము చూపి తమ గుణైకపక్షపాతమును బ్రకటించిన యవంతీమండలేశ్వరులకు మా వత్సప్రభుపక్షమున, వత్సరాజ్యప్రజాపక్షమునఁ గృతజ్ఞతాభివందనములు తెలుపుచున్నాను." అని యుచ్చైస్స్వరమునఁబలికి తనస్వర్ణపాత్రలోని యక్షతలుతీసివాసవదత్తా వత్సరాజుల శ్రేయఃపరంపరాభివృద్ధులను గోరుచు వేదోక్తముగ నాశీర్వదించెను.

వెనువెంట వృద్ధవేదమూర్తులును, మహారాజును నక్షతలు చల్లిరి. పిదపఁ బ్రాసాదయవనికలనుండి సువర్ణాక్షతలఁ జల్లులు వచ్చి యా చిత్రపటములను ముంచి యెత్తెను.

మహారాజపుత్రులు గోపాల పాలకులు వచ్చినపెద్దల కును, రాజబంధువులకును గర్పూరతాంబూల చందనాదు లిచ్చి సత్కరించిరి.

వివాహమంగళ మిట్లు సలక్షణముగ ముగిసినమీ దటఁ గన్నులవెంట నానంద బాష్పము లురలఁగా యా గంధరాయణుఁ డిట్లనెను.

మహారాజా, యింక నా కౌశాంబీప్రయాణమునకు సెల విప్పింపుఁడు. మఱియు నా దొక మనవి. 'ఇచట మీ సంతృప్తికొఱకు లాంఛనప్రాయమగు పుత్రికా కల్యాణమైనది. కాని ప్రత్యక్షముగ నగ్నిసాక్షికముగ నాకౌశాంబీరాజభవనమునఁ బరిణయోత్సవము జరుగవల సియున్నది. దయచేసి చిరంజీవులు గోపాలపాలక రాజకు మారులను నాతోఁ బంపి యాశుభకార్యమును నిండు పఱుప వలసినదని కోరెను.

ప్రద్యోతమహారాజు నీళ్ళునిండి తళతళ మెఱయు కన్ను లతో తలయూపి తనసమ్మతి నెఱిఁగించెను.

---

సంపత్తితో, భుజబలముతో నవిరతముగఁ గాచి రక్షించు నీబోటి మంత్రులే యఖండభరతఖండమునకు మకుటాయమానులు. రాష్ట్రక్షేమమునకై నిర్విరామముగఁ దపించునీవంటి భారత మంత్రులచరిత్ర సుస్థిరముగ సువర్ణాక్షరములతో లిఖింపఁబడుట సత్యము.”

ఆ వృద్ధమాతృమూర్తి యీమాట లనుచుండగా సాక్షాద్భారతమాతయే హిమశిఖరమున నిలుచుండి గొంతెత్తి పలుకుచున్నట్లు తోఁచి మహామంత్రి కన్నులలో నీరుచిందెను.

యౌగంధరాయణుఁడు నవ్వుచు ‘ఉజ్జయినీ రాజవీథులలోఁ జినుఁగు పాఁతలతోఁ దిరుగుపిచ్చివాని కీప్రశంస లెందుకు తల్లీ’ యని చమత్కరింపఁగా నింతలో దైవపూజ ముగించికొని భరతవంశ తేజోమూర్తిగా వెలుఁగుచు నచటికివచ్చిన వత్సప్రభువు దరహసితముఖుఁడై

“ఆపిచ్చివాఁడే మా కౌశాంబీరాజ్య గౌరవప్రతిష్ఠలఁ గాపాడు పతాకాస్తంభము” అని పలుకుచుఁ దటాలున యౌగంధరాయణమంత్రిని గాఁగలించుకొనియాతనికౌఁగిలిలోఁ గరఁగిపోయెను. కొంతసే పిరువురిమధ్య మాటలు రాలేదు. ఎట్టకేలకు వత్సప్రభుఁడే మాట తెములుచ్చుకొని యిట్లనెను.

91 – 9

"సచివమణి! కుహనోన్మాద సంగరముల,
శాస్త్రదృష్టంబులైన విచారణముల,
ఘనతరప్రజ్ఞలను నీవు, మునుఁగు మమ్ము
క్లిష్టకాలంబు నందు రక్షించినావు."

# వి వ ర ణ ము

మౌక్తికసౌధము—ముత్యాలమేడ
ముదల—ఆజ్ఞ
శ్రీతాళపత్రము—వ్రాతకుఁ బూర్వ ముపయోగించు పెద్దతాటి యాకులు
అలవోక—స్వేచ్ఛ, అనుకొనకుండ (యదృచ్ఛ)
వితర్దిక—అరుగు, వేదిక
స్థాయీభావము—ఒకరసమును బుట్టించుటకు ఆధారమైన భావము.
లోకాలోకతటములు—భూమియంచుననున్న కొండచరియలు
సమిత్—కట్టెపుల్లలు
శాణోల్లేఖనము—సానఁబట్టుట
ఆఖేటము, మృగయ—వేట
పాపఱేఁడు—సర్పరాజు
మాతంగ, ద్విరద, దంతావళ—ఏనుగు
బేగిరావుత్తులు—తొందరగఁబోవు గుఱ్ఱపురౌతులు
సేతుబంధనము—గట్టుకట్టుట
రాణువ—సేన
నీలకువలయుతనువు—నల్లగలువవంటి శరీరముగలది
సాలవృక్షము—మద్దిచెట్టు
వఱ్ఱోడిన—ప్రవహించిన
అభ్యర్థితులు—పూజ్యులు
కుంతము—బల్లెము
క్షత్రియాణి—క్షత్రియస్త్రీ
మస్తిష్కము—మెదడు
నెగులు—చింత

వాంగులు—వంగదేశీయులు
ఆభిజాత్యము—గొప్పకులమునఁబుట్టుట
వల్లకి—వీణ
కొత్తళములు—కోటబురుజులు
బంధి—బంధముగలవాఁడు—ఖైదీ
ఆచార్యకము—గురుత్వము
గాంధర్వము—సంగీతము
విగళితములు—జాఱినవి
స్విన్నము—తడియైనది
కర్రి—నల్లని
అన్యోన్యాశ్రయము—వ్యాకరణములోనిది యొకదోషము. రెండు విషయములు, ఒకదానిపై వేఱొకటి యాధారపడియుండుట.
పాణినీయము—పాణిని మహర్షి రచించిన వ్యాకరణము
కాలాంతకుఁడు—కాలమను యముఁడు
బ్రహ్మబంధువు—బ్రాహ్మణులలో నిందితుఁడు
స్వస్తివాయనము—ఆశీర్వదించి పుచ్చుకొను ప్రతిఫలము
తిరు...మాళిగలు—దేవాలయమునకు, చుట్టునున్న దేవతాగృహముల వరుస
పాణిద్వారము—ఇంటి వెనుక గుమ్మము
మధుసేవ—మద్యముత్రాగుట
శుండాదండము—కఱ్ఱవంటి తొండము
ఘంటాపదము—రాజమార్గము
సాధిక్షేపముగ—ఆక్షేపణముగ
పల్యంకిక—పల్లకి
వేత్రాననము—పేపబెత్తపు పీఠము

నారాచము—బాణము
కార్ముకములు—విండ్లు
వ్యంగ్యము—స్ఫురించుట
దేహి—ఇమ్ము (సం. క్రి.)
నాస్తి—లేదు
అతిశాయిత—మించుట
అహంత—అహంకారము
కౌశేయ...ములు—పట్టుబట్టలు
యుగ్మము—జంట
చతుశ్శాల—నాలుగిండ్ల భవనము
హేమాంబుపూరము—పన్నీరు
సదస్సు—సభ
తంత్రావాపములు—ఉపాయములు నడపుట
ఉద్వాహము—పెండ్లి
యవనికలు—తెరలు
శతఘ్నులు—ఫిరంగులు
కుహనా—మాయ
సంగరము—ప్రతిజ్ఞ